# గౌతమ బుద్ధుఁడు

(సంభాషణాత్మకము

రచయిత:

యం. సుదర్శనాచార్యులు, బి.ఏ., బి.ఇడి.,

ప్రకాశకులు

సి. యస్. శ్రేష్ఠి,

విద్యావిషయక ప్రకాశకులు

చార్ కమాన్ .... హైద్రాబాదు-2.

1957

# అభిప్రాయము



సత్యాహింసాస్వరూపుఁడైన గౌతమ బుద్ధుని పుణ్యజీవిత మొక్క భారతీయులకే కాక సర్వమానవులకును శిరోధార్య మైనది. ఎందఱెన్నిరీతుల వెలయించినను గ్రొత్తఁదనముఁ బాయకుండుటే దానియందలి వైశిష్ట్యము. సర్వజనీనత విషయమున సమగ్రమానవతామూర్తి యైన శ్రీరామచంద్రుని చరిత్ర తరువాత దానినే యెన్నవలయును. అది సర్వప్రపంచమునకును ఆదర్శ మైననాఁడు నిజమైన యభ్యుదయము నెలకొన్నదని మన మానందింపవచ్చును.

శ్రీయుతులైన యమ్. సుదర్శనాచార్యులు బి. ఏ., బి. ఇడి., గా రాంధ్రపాఠకుల కెల్లరికిని సుపరిచితులు. నీతి ధర్మములందును సంప్రదాయములందును వారికిఁ గల విశ్వాసము గాఢమైనది. వివేకానందపత్రిక ముఖమునను, గ్రంథరూపమునను వారు ప్రకటించిన పెక్కు వ్యాసములును, భావములును వారి ధర్మనిష్ఠకుఁ దార్కాణములై యలరారుచున్నవి. జను లెల్లరును, ముఖ్యముగా విద్యార్థులును గౌతమ బుద్ధుని జీవితమునం దిమిడి యున్న ధర్మసిద్ధాంత సౌరభము నాఘ్రాణించి, యానందపరవశులై, యుత్తమ జీవిత మార్గమును సరిదిద్దుకొందు రను నుద్దేశముతో వారీ చిన్నిపొత్త

మును వెలయించినారు. ధర్మప్రచోదిత మైన వారి యాశ యము తప్పక నెఱవేఱుఁగాక యని హృదయపూర్వకముగా భగవంతునిఁ బ్రార్థించుచున్నాను.

ఈ గ్రంథము తండ్రికొడుకులకు జరిగిన సంభాషణము రూపమున వెలయింపఁబడినది. కొడు కడిగిన ప్రశ్నల కన్నిటికి నుచితవిధమున సమాధాన మిచ్చుచుఁ దండ్రి యందు గౌతమ బుద్ధుని జీవితమును, అందలి విశేషములను వివరించి చెప్పెను. ప్రసక్తానుప్రసక్తముగా నిందుఁ జొప్పింపఁబడిన బుద్ధుని జీవితసంబంధములైన యుపాఖ్యానము లెంతో రమణీయములై నీతిధర్మములను నిశితముగా నుపదేశించుచున్నవి. అచ్చటచ్చటఁ గథానుగుణముగాఁ జక్కని చిత్రములుకూడఁ బ్రవేశపెట్టఁబడినవి. శైలి సరళము, ధారాళము, శక్తిమంత మునై సర్వజన సుబోధముగా నున్నది. అది నిర్దుష్టమును, నిరాడంబరమును నై చదివినకొలంది చవు లూరించుచున్నది.

బుద్ధుఁడు శ్రీ విష్ణు దశావతారములలో నొకఁ డని పలువురు తలంతురు. అందెంత సత్యమున్నదో యింకను బరిశీలింపవలసిన విషయము. పురాణము లవతారపురుషుఁ డైన బుద్ధునికథ వేఱుగా నిరూపించుచున్నవి. కాని యొక్క సంగతి మాత్రము సత్యము. బుద్ధుఁడు వేదమతమును బ్రతిఘటించినవాఁడే యైనను గ్రమముగా శ్రీ విష్ణుని యవతారములలో నొకఁడుగాఁ బరిగణింపఁబడుట సంభవించినది. ఆతని

మతముకూడఁ గొన్ని శతాబ్దులు వేఱుగా నుండి యుండి చివరికి హిందూమతమున లీనమైపోయినది.

శ్రీసుదర్శనాచార్యులుగా రింకను నిట్టి సద్గ్రంథములు పెక్కు రచించి యాంధ్రభాషకును ఆంధ్రలోకమునకును మేలు చేయుదురుగాక యని యాశించుచున్నాను.

డా॥ దివాకర్ల వేంకటావధాని,
M. A., (Hons) Ph., D.,
ఆంధ్రోపన్యాసకుఁడు,
ఉస్మానియా విశ్వ విద్యాలయము



# మనవి



ఇది బుద్ధుని జీవితచరిత్ర కాదు. దాని నింతవఱ కెందఱో వ్రాసియుండిరి. నా యొనర్చిన ప్రయత్న మేమనిన, బుద్ధభగవానుడుపదేశించిన సారాంశ మెంతటి మహత్తరమైనదో, దాని నాచరించు విధాన మెట్టిదో, తద్వారా నేటి ప్రపంచ సమస్యలను సామరస్యముగ పరిష్కరించుట కెట్టి వీలు కలదో స్థూలముగ సూచించుట.

బుద్ధుడు విష్ణ్వవతారములలో నొకడుగ పరిగణింప బడినాడు. ఆ మహామహుని ఆదేశములను సమగ్రముగ నర్థము జేసికొనుట అసాధ్యము. ప్రారంభదశలో ప్రతి చిన్నవిషయము కష్టతరముగ దోచును. ఐనను, ప్రయత్నలోప ముండకూడదు.

ఎంతటి ఐశ్వర్యవంతుని కైనను అసంతృప్తి, మానసికావేదన కలుగుచుండును. ఆశావిఘాతములవలన ఆవేదన కలుగును. మనసు కలతజెందిన నాడు శాంతి సౌఖ్యములు మృగ్యము లగును. మానసికావేదన బోగొట్టుకొని స్థిరచిత్తముతో జీవితము గడుప దలచిన మానవునికి బుద్ధుడు బోధించిన మార్గము ననుసరించుటయే పరమావధి.

ఏ ఒక్క మానవునికే కాదు; మానవజాతి కంతటికి బుద్ధుని ఆదేశము శాంతిసందేశమని భావించవలెను. అశాంతితో కుములుచున్న ప్రపంచజాతుల కా ఆదేశము తరుణోపాయ మగుచున్నది. ఎంత శీఘ్రముగ ఆ విషయముల గ్రహించగలమో, అంత శీఘ్రముగ శాశ్వతమగు శాంతి మనకు లభ్యము కాగలదు.

రచయిత.

# గౌతమ బుద్ధుడు

## [సంభాషణాత్మకము]



తండ్రి:—రామూ! మొన్న నీవు చదివినకథ జ్ఞాపకమున్నదా?

రాము:—ఆఁ... ప్రహ్లాదచరిత్ర చదివితిని.

తం:—ప్రహ్లాదు డెవని కుమారుడు?

రా:—రాక్షసరాజగు హిరణ్యకశిపుని కుమారుడు.

తం:—హిరణ్యకశిపుడు కుమారుని బాధించుటకుగల కారణ మేమి?

రా:—తండ్రిమాట నెదిరించి ప్రహ్లాదుడు విష్ణుమూర్తిని ధ్యానించుటవలన బాధలు పడెను.

తం:—బాధలనుండి తప్పించి అతనిని రక్షించిన దెవరు?

రా:—విష్ణుమూర్తి నృసింహాకృతితో వచ్చి హిరణ్యకశిపుని చంపి ప్రహ్లాదుని రక్షించెను.

తం:—విష్ణుమూర్తి ఎన్ని అవతారము లెత్తెను?

రా:—పది.

తం:—అవి ఏవియో నీవు చెప్పగలవా?

రా:—మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, శ్రీరామ, కృష్ణ, బుద్ధ, కల్కి అను పది అవతారములను విష్ణుమూర్తి దాల్చెను.

తం:—ఔను. తొమ్మిదవ అవతారమును గురించి నీ కేమైన తెలియునా?

రా:—బుద్ధావతారమేనా? ఆ అవతారమును గుఱించి ఇంత వఱకు చదువలేదు. కనుక అన్ని సంగతులను విను టకు కుతూహలముగ నున్నది.

తం:—అట్లయిన వినుము. "హిమాలయ పర్వతముల ప్రాంత మున గల రాజ్యము నొకదానిని, శాక్యులరాజు పరి పాలించుచుండెను. అతనికి తన ప్రజ లనిన గౌరవము, ప్రేమ కలవు. వారికెలాటి ఇబ్బందులు, కొరతలేకుండ కంటికి రెప్పవలె కాపాడుచు రాజ్య మేలుచుండెను. ప్రజ లతనిని దైవసమానుడని భావించి భక్తితో గొలుచుచుండిరి. కాని అతనికి ఒకటే లోటు కలదు. సంతానహీనుడైన సంతాపముతో కాలము గడుపు చుండెను. తన తరువాత సింహాసనము నధిష్ఠించు కుమారుడు కలుగకపోయె నని పొద్దస్తమానము విచారించుచుండెను. అతనిభార్య మాయాదేవి. భర్త కన్నివిధముల తోడునీడై సంతానము లేదను దుఃఖ మున భాగము పంచుకొనుచు రోజులు గడపుచుం డెను. వర్షాకాలమున, ఆచారము ననుసరించి వ్రత ములు జరిపి ఒకనాటి రాత్రి నిద్రించగా ఆమెకు స్వప్నము వచ్చెను. ఒక తెల్లటి ఏనుగు సువాసనలను విరజిమ్ము పుష్పమును తన తొండముతో తుంచి ఆమె కుడిభాగముపై మెల్లగ కొట్టుచున్నట్లు కల గాంచి, అంతయు భర్తకు వినిపించెను.

రా:—నాన్నా! కలలు నిజము కావని చెప్పితివి కదా! ఆమెకు వచ్చిన కల రాజున కేల తెలుపబడినది?

తం:—అడుగవలసిన ప్రశ్నయే అడిగితివి. చిరకాలము సంతానవాంఛతో, వేరే ఇతర భావనలకు చోటివ్వకుండ, విశ్వాసపూరిత హృదయముతో, నిష్ఠతో, వ్రతములు చేసి, లేక చేయించి, ఫలాపేక్ష కలిగియున్నవారికి, వారి అదృష్టము కలిసి వచ్చినప్పుడు ముందు జరుగబోవు సంఘటనము స్వప్నముఖమున విశదమగు ననుటలో సత్యము లేకపోలేదు. ఇక మనకు సాధారణముగ వచ్చుచుండు కలలు సత్యదూరములుగ నుండును.

రా:—దానికి కారణ మేమి ?

తం:—మనము చదివిన విషయములు, చూచిన దృశ్యములు, వినిన సంగతులు, ఎప్పుడో వానిని మనము మఱచి పోయినపుడు క్రొత్తగ జరిగినట్లు కలగా జ్ఞప్తికి వచ్చుచుండును.

రా:—రాణికి వచ్చిన కలసంగతి ఏమైనది ?

తం:—రాజుకు ఆ కలవలన ఆశ్చర్యము కలిగినది. దాని అర్థము తెలిసికొనలేకపోయెను. పండితులను పిలిపించి ఆ కలయొక్క ప్రాముఖ్యత నెఱుగ దలచెను. వారు దీర్ఘముగ ఆలోచించి శీఘ్రముగనే రాజునకొక పుత్త్రు డుదయించు ననియు, అతనికీర్తి సుగంధమువలె నలుదిక్కుల వ్యాపించు ననియు చెప్పిరి. రాజునకు కలిగిన ఆనందమునకు పరిమితి లేకపోయినది.

ఎప్పుడు కుమారుడు జన్మించునో అని రోజూ కయుగముగ గడపెను. మాయాదేవి ప్రసవించి పుత్రుని గనెను. భార్యాభర్తల హృదయములు ఆనందముతో నిండి యుండుటే గాక, రాజసౌధమునందు, రాజ్యమంతటను పలురకములగు ఆనందోత్సవములు జరిగెను. శుద్ధోదనుడు కుమారునికి సిద్ధార్థుడని నామకరణము జేసెను.

రా:—ఆ పేరున కర్థ మేమి?

సం:—అతని ఆశలు సిద్ధింపజేసినవాడని అర్థము.

రా:—తండ్రి ఎటువంటి ఆశలు కలిగి యుండెను?

తం:—ఆ నాటి రాజు లందరిలో గొప్పవాడగునని, అధికారైశ్వర్యములతో తులతూగగలడని, విజ్ఞానస్వరూపుడగునని, నల్దిక్కుల అతనికీర్తి వ్యాపించగలదని శుద్ధోదనుడు ఆశించెను.

దురదృష్టవశమున సిద్ధార్థుని బాల్యముననే మాయాదేవి మరణించినది. తల్లిలేని బిడ్డ డగుటచే రాజు అమితగారాబముతో కుమారుని పెంచుచుండెను. తనకుగల ఐశ్వర్యమంతయు వెచ్చబెట్ట దలచెను. ఎన్నో సౌకర్యములను సమకూర్చెను. కాని సిద్ధార్థుడు చింతాక్రాంతుడై ఏకాంతమున కాలము బుచ్చుచుండెను.

రా:—అన్ని సౌకర్యములు గల్గించినను విచారించుటకు కారణ మేమి ?

తం:—ప్రహ్లాదు డెందుకు (తండ్రి) కల్గించిన సౌకర్యములతో తృప్తిజెందకపోయెను ?

రా:—విష్ణుదర్శనము లభించుటయే అతని కోరికగనుక.

తం:—ప్రహ్లాదుడు విష్ణుభక్తుడు. కాని, సిద్ధార్థుడు విష్ణ్వవతారము.

రా:—సిద్ధార్థు డెట్లగును ? పది అవతారములలో ఆ పేరు లేదు కదా ?

తం:—సిద్ధార్థుడే కొంతకాలానికి బుద్ధుడైనాడు.

రా:—అతని చింతకు కారణ మేమి ?

తం:—సిద్ధార్థుడు విద్యలన్నిటిని అభ్యసించెను. అస్త్రవిద్యలో అందరిని మించిన సామర్థ్యము సాధించెను. ప్రతి సంవత్సరము కపిలవస్తు రాజధానిలో జరుగు రైతుల పండుగ ఆ యేడు మహావైభవముగ ప్రారంభమయ్యెను. నగరమంతయు అలంకరింపబడినది. రాజసౌధము అధికారులతో నిండియుండెను. శుద్ధోదనుడు బంగారపు రేకు లమర్చబడి వజ్రముల కాంతితో ప్రకాశించుచున్నట్టి వేయి నాగళ్ళను ప్రదర్శనకై ఏర్పాటు చేయించెను. నాగళ్ళతో దున్నుటకై తక్కిన వారిని

ఆజ్ఞాపించి స్వయముగ నాగలిని చేబట్టెను. కర్షకులు, ప్రజలు, అధికారులు, ఉద్యోగులు భేదభావములను మఱచి సంతోషముతో ఆనాడు ఉత్సాహపూరితులై ప్రదర్శనమునందు పాల్గొనిరి. కాని సిద్ధార్థునికి ఈ వినోదోత్సవము బాధాకరముగ నుండెను. నడి ఎండలో కర్షకులు నోరులేని ఎద్దులను కొట్టి పఱు గెత్తించుట అతని కసహ్యముగ దోచినది. ఒక చెట్టు క్రింద ఒంటరిగ కూర్చొని మానవుల అవివేకమును, అజ్ఞానమునుగురించి ఆలోచించుకొనుచుండెను. అతనిని జూచి తక్కినవారందఱు కష్టించి పనిచేయుట కిష్టము లేక ఆ విధముగ కూర్చుండెనని భావించిరి. నాగలినే బట్టలేనివాడు యుద్ధమేమి చేయగలడని సంశయించిరి. ఇతరు లనుకొనుమాటలను విని రాజుకలతజెంది సిద్ధార్థునికి తెలియజేసెను. సిద్ధార్థుడు వారి సంశయము నిరాధారమైనదనియు, ఎవరితోనైన తాను పోరాడు టకు సిద్ధమేననియు తండ్రికి సమాధాన మొసగెను.

రా:—సిద్ధార్థుడు చెప్పినదాని నెట్లు సమర్థించుకొనగలిగెను?

తం:—ఆ ఉత్సవమునకు వచ్చినవారిలో ఒక దేశపురాజు తన కుమార్తె వివాహము జరుపనెంచి స్వయంవరము చాటించెను. అతని కుమార్తె అందాల రాణి. సద్గుణ వల్లి. అస్త్రవిద్యలో పాల్గొని ఏ వీరుడు విజయము గాంచగల్గునో అతనికి తన కుమార్తెనిచ్చి వివాహము జేసెదనని ప్రకటించెను. ఎందఱో రాకుమారులు విజ

యాభిలాషులై పెనగులాడిరి. అందరిని సిద్ధార్థుడు వరుసగ ఓడించి గెలుపొందెను. యశోధర సిద్ధార్థుని వరించి మెడలో పూలమాలవైచెను. ఇరువురికి మహా వైభవముగ వివాహమయ్యెను. ఇతర దేశపు రాజులకు సిద్ధార్థుడెంతటి పరాక్రమశాలియో, అస్త్ర విద్యా పారంగతుడో విశదమైనది. ఇక శుద్ధోదనుని ఆనందమునకు పరిమితియే లేదు.

సిద్ధార్థుని జీవితమునందు వివాహానంతరము మార్పు వచ్చినది. సాధారణ మానవ జీవిత సౌఖ్యములను అనుభవించుచుండెను. ఈ మార్పునకు కారణము అతని సుందరాంగియని చెప్పవలెను. కొంత కాలమువఱకు అతని దృష్టి మానవుల కష్టనిష్టురములపై ప్రసరించలేదు. ఈలోగా అతనికొక కుమారుడు జనించెను. ఒకనాడు వాహ్యాళి వెడలి తిరిగి వచ్చుచు మానవ జీవితమెంత అల్పమైనదో, ప్రాపంచిక విషయములకై మానవు డేవిధముగ ప్రాకులాడి కర్మబద్ధుడై జననమరణ రాహిత్యమునకు పాటుపడక కాలము వృథాబుచ్చునో భార్యతో ప్రసంగించెను. ఎందువలన మానవున కిట్టి విషాదస్థితి ప్రాప్తమగునో కనుగొనుట కెందరిని ప్రశ్నించినను సరియైన సమాధానము దొఱకనందున సిద్ధార్థుని జిజ్ఞాస హెచ్చుకాజొచ్చినది. ప్రపంచముతో ఎడతెగని సంబంధము కల్పించుకొనిన మానవుని జీవితమునందు కష్టసుఖములు, కలిమి

లేములు, కలుగుట సహజమేనని పండితులు చెప్పిన దానితో అతనికి సంతృప్తి కలుగలేదు. పైగా అతని ఆరాటము పెరుగుట కవకాశము కలిగినది. ఆనాటి సాంఘికాచారములు, మూఢనమ్మకములు, హింసాత్మక ప్రజావిధానము, అతని దృష్టిలో మానవుని పతనమునకు ప్రధానకారణములుగ దోచినవి. కాలము గడచినకొలది అతనిలో అశాంతి చెలరేగినది. అందాలరాశి యగు భార్యవలన కలుగు సౌఖ్యము, అతులైశ్వర్యము, తృణప్రాయములుగ దోచినవి. మానవుని సౌఖ్యము ఐశ్వర్యముమీద, దేహానుగత మగు మమకారముమీద ఆధారపడియుండదని తెలిసికొనెను.

జీవితము అనుక్షణము మారుచుండును. ఆ మార్పు మంచిది కావచ్చును; చెడ్డది కావచ్చును. మానవుడు స్వార్థాభిలాషియై అనేక విధముల ప్రయత్నించును. అతని ప్రయత్నము ఫలించవచ్చును; ఫలించక పోవచ్చును. తుదకు భగవత్కృపపై ఆధారపడక తప్పదు. కాని జరుగుమార్పు కష్టకారణమగుచో మానవుడు బాధపడును. జీవితమునందు కష్టసుఖము లొకదానితో నొకటి పెనవేసికొనియుండును. అవి దివారాత్రములవలె ఒకటి తరువాత మఱొకటి వచ్చుచుండును. మానవు డీ రహస్యము నెఱుగక, ఎరిగియు విశ్వసించక, విశ్వసించియు ఆచరించక, ఇష్టము వచ్చి

నట్లు మెలగి దానివలన కలుగు ఫలితముల ననుభ వించుచుండును. తా నెందుకు జన్మించినది, ఏమి చేయుచు మృత్యువు నెదురుచూడవలసినది, గమనిం పక ప్రవర్తించుట వలననే మానవుని జీవితము దుఃఖ భాజన మగుచున్నది. సృష్టిరహస్య మెఱిగినవాడే భగవంతుని కృపకు పాత్రుడు కాగలడు. పెరుగుట, అభివృద్ధిజెందుట, నశించుట ప్రకృతి సహజము. మానవు డీ రహస్యము నెఱుగుట కిష్టపడడు. మరణ మనిన అతనికి భయము. కాని మరణింపక తప్పదు. ఇతరులు చనిపోయిరను వార్తను విని ఈషణ్మాత్రము చింతించకున్నను, తనకో, తన బంధువులకో రుగ్మత కలిగిన ప్రచంతులేని ఆవేదనకు గురియగును. మరణము తప్పదని ఎఱిగినను, మరణించుట యిష్టముకాదు కనుక ఆ విషయమై ఆలోచించుట వదలి స్వసౌఖ్యమునకై అహర్నిశలు ప్రయత్నించుట ప్రతి జీవికి పరిపాటి యైనది. మరణ మాసన్నమైనపుడు, తప్పించుకొనలేని అసహాయస్థితికి వచ్చి, దిక్కులేక వెనుకటి జీవిత విధా నమును దలచుకొని విచారపడును. అందువలన లాభ మావంతయు కలుగబోదు. హంతకుడు ఉరిస్తంభము నెక్కి చనిపోవుటకు ముందు తన దుష్కృత్యమును తలచుకొని విలపించుట వృథా శ్రమయేకదా! జరా భారము పైబడుటకు ముందుగనే మానవుడు మంచి చెష్టల నరయుచు, సక్రమ జీవితవిధానము నలవరచు కొని, తదనుగుణముగ ఏమరుపాటు లేకుండ మెల

గుచు, భగవదనుగ్రహము సంపాదించవలెను. కనుకనే సిద్ధార్థుడు యౌవన దశయందు ప్రాపంచిక సౌఖ్యములను, సంపదను, అధికారమును పరిత్యజించెను.

రా:—ఆనాటి సాంఘికాచారము లెట్లుండెను? నమ్మకములలో మూఢ నమ్మకము లెట్టివి?

తం:—ఆనాడే కాదు ఈనాడుకూడ మనమందఱము కొన్ని మూఢ నమ్మకములకు కట్టుబడి జీవించుచున్నాము. ఆచారములన్నియు, సక్రమముగ వాని అంతరార్థ మెఱిగి పాటించుచున్నంతవఱకు మంచివేయగును. ఆచారములు మంచివికావను చిలుకపలుకులవలస లాభములేదు. మంచిదికాని ఆచారము తరతరాల నుండి వచ్చుట కవకాశము లేదు. ఒకప్పుడు మంచిదని తోచిన ఆచారము కొన్నాళ్ళకు విసర్జనీయమని ఎందుకు తోచినదో ఎఱిగి మెలగుట వాంఛనీయము. ఏమి ఆలోచించకుండ, మన తాతముత్తాతలు అనుసరించిరి కనుక మన మెందుకు వారి ననుకరించకూడదను భావముతో మెలగుటయే మూఢనమ్మకము క్రింద పరిగణింపబడును.

సిద్ధార్థుని కాలమునాటి సాంఘికార్థిక పరిస్థితులు సక్రమముగ లేవు. ఆ సంగతి నెఱిగి సిద్ధార్థుని హృదయము కలతజెందుటలో ఆశ్చర్యమేమున్నది? ఎటు జూచినను ప్రజలు అనేక బాధలకు గురియై జీవిత భారమును గడపుచుండిరి. వారిలో విచక్షణ శక్తి

నశించి ఒకరినొకరిని అనుకరించు దుర్దశ సంఘటించి నది. వారి విశ్వాసములను వ్యాఖ్యానించుట కష్టతర మైనది. బ్రాహ్మణుల అధికారము నిరంకుశముగ సాగజొచ్చినది. మతవిషయములను గురించి వా రొనర్చు వ్యాఖ్యానమే ప్రామాణికముగ భావింపబడి నది. ప్రజల అమాయకత నెరిగి వారు తమ అధికార మును స్థిరమొనర్చుకొన గలిగిరి. వర్ణాశ్రమధర్మము లలో వర్ణవ్యవస్థ కొక్కదానికే ప్రాధాన్యత వచ్చినది. రాజులైనను బ్రాహ్మణుల అధికారమును శంకింప వెరచుచుండిరి. "యథా రాజా తథా ప్రజా" అను సూక్తి ననుసరించి సామాన్యప్రజ లెట్టి పరిస్థితులలో జిక్కుకొనిరో ప్రత్యేకముగ చెప్పనక్కరలేదు.

సిద్ధార్థున కీ పరిస్థితుల పరిణామ మెంత భయంకర ముగ నుండునో అవగత మైనది. అత నదివఱకే సన్న్యసించి, మానవు లనుభవించు కష్టము లంతమగుమార్గ మన్వేషింప నిశ్చయించుకొనియుండెను. పుత్రునిజనన వార్త విన్నప్పు డతనికి సంతోషము కలుగలేదు; విచారము కలిగినది. ఇష్టము లేకున్నను, స్వేచ్ఛాజీవి కాదలచినను, తనను సంసార మను సుడిగుండములో నికి విధి ఈడ్చుకొని పోవుచున్నదని విచారించినాడు. సన్న్యసించుటకై తాను జేసికొనిన నిశ్చయముగురించి సిద్ధార్థుడు తండ్రికి తెలిపినాడు. శుద్ధోదనుడు కుమా రుని నిశ్చయము నవహేళన మొనర్చి, దానిని విర

మించుకొనవలసినదిగ ఉద్బోధించినాడు. రాజ్యపాలన మను ఎఱకు కుమారుని జీవితమును బలిజేయ సంక ల్పించుకొని ఎన్నో విధముల నచ్చజెప్పినాడు. కాని, సిద్ధార్థుడు స్థిరసంకల్పు డగుటచే రాజ్యభోగములకు ఆశించకుండ సన్యసించుటకు కృతనిశ్చయు డయ్యెను.

రా:—భోగభాగ్యములను పరిత్యజించి సన్యసించుట వలన లాభ మేమున్నది ? సౌఖ్యములను కాలదన్ని, కష్టము లనుభవించుట బుద్ధిహీనత కాదా ?

తం:—రామూ ! మన మందర మటులనే భావించి మెలగు దుము. మనకు సౌఖ్యములే కావలెను. కష్టపడుట పనికిరాదు. కారము లేకుండ తీపినే ఎంత కాలము అనుభవింపగలము ? మితిమీరిన తీపివలన అయిష్టత తప్పక కలుగును. అప్పుడు కారపువస్తువులపై మనసు పోవును. కారము పుట్టినపుడు వాని అవసరము పోయి, తీపివస్తువులను గైకొందుము. జీవితమును నాలుగు దశలక్రింద విభజించిరి. బాల్యము, కౌమారము, యౌవనము, వృద్ధాప్యము అనునవి నాలుగు దశలు. బాల్య కౌమారములకన్న యౌవన మున్నంతవఱకు మానవుడు, స్థిరసంకల్పుడై నియమిత జీవితవిధానము గడుపలేనిచో, ఇంద్రియలోలుడై సర్వము మఱచి పాప పుణ్య విచక్షణ లేక, కుశంకలకు, కుతర్కములకు తా నొసగిన బుద్ధిబలము కలిగి, యథేచ్ఛగ ప్రవర్తిం చును. ఇంద్రియ సౌఖ్యములను యౌవనదశలో లెక్కలేక

రించెడువారే మహాపురుషులు. యౌవనమదము పిచ్చి వంటిది. ఎంతటి మేధాసంపన్నులైనను యౌవన దశలో నైతిక పతనము నందుచునే యుండును. తెలివిగలవా రందఱు నిష్కళంక జీవితము గడుపుదు రని భావించుట పొరపాటు. మేధాశక్తి వేరు, నైతిక శక్తి వేరు. నైతిక శక్తి కష్టసాధ్యము. మేధాశక్తి ఆనువంశికము. యౌవన ముడిగిన తరువాత దేహ దారుఢ్యము తప్పిపోవుటచే చేయునదిలేక మానవులు భగవద్గీతా పారాయణమునకు గడంగుదురు. ఐనను పాపవాసనలు బలీయము లగుటచే వారిచిత్తము పరి భ్రమించుచునే యుండును. ఎన్నిసాఱ్లు భగవద్గీతను కంఠోపాఠముగ వల్లెవేసిన నేమి లాభము ?

ప్ర:—సిద్ధార్థుడు సన్యసించిన తరువాత అరణ్యములలో తపము జేసినాడా ?

జ:—సిద్ధార్థుని నిశ్చయ మెరిగినవా రందరు మొదట పరి హాసించిరి ; వలదని వారించిరి. సన్యసించుట సామా న్యము కాదు. స్థిరసంకల్పము, మనోధైర్యము, భగవ ద్భక్తి కలవారికే సన్యసించుట సాధ్య మగును. సిద్ధా ర్థుని సంకల్పము నెఱిగి అతనిభార్య వలదని కరుణా పూరితముగ ప్రార్థించినది. కుమారుని జూచియైన తన ననుగ్రహింపవలసినదిగ వేడుకొనినది. భార్యను, కుమారుని విడచి మరల వారి నెన్నడు జూడ దలపక అరణ్యముల కేగుట ఎంత బాధాకరమో అందరికి



దేవతాసంఘమువలె నున్న సింహాసనము నాశ్రయించుచున్న సిద్ధార్థుడు.

తెలిసినదే. ఈ బాధకన్న, మానవుల నుద్ధరింపవలె ననుసదాశయము సిద్ధార్థుని హృదయమునందు గాఢముగ నెలకొనిపోయినది.

యశోధరచే ఉపలాలితుడై నిద్రపోవునప్పుడు సైతము "ఓ మానవలోకమా! ఇచట జరుగు అక్రమచర్యలను గమనించుచునే యున్నాను. మానవుల ఆక్రందనధ్వనుల నాలకించుచున్నాను. రక్షణార్థము బయలుదేరుచున్నాను" అని బిగ్గరగ కలువరించును. ప్రశ్నించు భార్యనంక విజ్ఞాన జ్యోతులు వెలయు దృక్కులను ప్రసరించి మిన్నకుండును. ఆమె నేత్రములనుండి వెల్వడు అశ్రువులను దుడుచుటకై మందహాస మొసర్చి ప్రాపంచిక విషయములను ప్రసంగించును.

ఒకనాడు సిద్ధార్థుని కోరికపై వీణానాదము గావింపబడెను. ఆనాద మితరులకు కర్ణపేయముగ నున్నది. కాని సిద్ధార్థునికి మాత్రము దేవతాసందేశము వినబడెను. గాలివలె జీవిత మొక రోదనము, ఒక నిట్టూర్పు, ఒక తుపాను, ఒక సంఘర్షము. గాలి ఎచటి నుండి వీచునో, ఎంతవరకు వీచునో, ఎప్పుడు ఆగిపోవునో ఎవరికి తెలియదు. అట్లనే జీవిత మెప్పుడు ప్రారంభమగునో, ఎప్పుడు అంతమగునో ఏ ప్రాణికి తెలియదు. జనన మరణములవలన నిరంతర బాధాను

భవములో తాత్కాలికముగ మార్పు కలుగుటకు అవకాశముండును. అట్టి మార్పుసైతము బాధాకరము గనే ఉండక తప్పదు. నీ వనుభవించుచున్న సౌఖ్య ములో మార్పు లేకున్నచో లాభ మేమి? "అతి సర్వత్ర విసర్జయేత్" అనునది సత్యము. మానవులు ప్రదర్శించు ఆదరానుగ్రహాభిమానములు క్షణికములు. మానవ దేహము వీణతో పోల్చిచూడుము. తీగెలు తెగినచో వీణపై అపశ్రుతులు పలుకును. అవి బిగువుగ నున్నంతవఱకు నాదము సక్రమ పద్ధతిలో సాగును. తీగెలులేని వీణ నిరుపయోగము. ప్రాణము లున్నంతవఱకే దేహమునకు ప్రాముఖ్యత కలదు. ప్రాణములు వాయువులో లీనమైనపిదప దేహము నిరుపయోగమై దహింపబడును. వాయువు ఒకచోట నిలిచియుండదు. సర్వత్ర వ్యాప్తమగును. అంతటను మానవుల జీవితములు సుఖదుఃఖములపై ఆధారపడి యుండుటవలన,స్పర్శాదోషము కారణముగ వాయువు సైతము ఆ యదార్థము స్ఫురింపజేయుచుండును. జీవిత మొక ప్రదర్శనము వంటిది. ఆద్యంతములుగల దగుట వలన అశాశ్వతమైనది. ప్రారంభమైనది పరిసమాప్తము గాకుండ నెట్లుండును? ఎడతెగకుండ పెరుగుట వలననే అంతమొందుటకు అవకాశ మేర్పడు చున్నది. ఆ పెరుగుదల సృష్టి సహజము. ఎవరికి దాని నడ్డగించు శక్తిలేదు. పరుగిడు వారిదమును నివారించు సామర్థ్య మెవరికి కలదు? ప్రవహించు నదిని

ఎవరడ్డగించ గలరు? అందఱు మానవులవలన గాని పని నీవలన సాధ్యము కాగలదు. మానవజాతి నుద్ధరించుభారము నీపైన గలదు. ఎంతకాలము ఆ బాధ్యతను తప్పించుకొని భోగభాగ్యములతో కులుకుచు గడుపగలవు? కార్యరంగమున నికనైన బ్రవేశించుము."

—కనులతో జూడకుండగనే, వీనులకు సోకిన ఆ దేవతా సందేశము నాధారముగ జేసికొని సన్యసించుట వలన సిద్ధార్థుని దృష్టి సమగ్రమమైన దనగలమా?

—ప్రత్యక్షముగ మానవు లనుభవించు కష్టసుఖములను జూచినాడు. తాత్కాలికముగ సంభవించు కష్టములే దుర్భరములని భావించుచు, పునర్జన్మ లెత్తవలసి వచ్చిన మహావిపత్తును విస్మరించి, దుఃఖించు మానవుల అజ్ఞానమునకు విచారపడినాడు. స్వార్థలాభమే సౌఖ్యదాయకమని, మరుక్షణము రానున్న విపత్తులను మరచి, సంతోషించువారి సంకుచిత దృష్టికి దుఃఖపడినాడు. కుష్టు మొదలగు భయంకర వ్యాధులతో బాధపడువారికై కన్నీరు కార్చినాడు. ప్రాణము పోయినను, పరిచయ మమకారదోషమువలన విలపించుచు శవము వెంట నడచిపోవువారి దుస్థితి దలచుకొని పరితపించినాడు. అశాశ్వతమైన దేహముపై ఎందు కింత మమకారమని తనకు దా బ్రశ్నించుకొనినాడు. జనన మరణములు లేకుండ ప్రతిజీవి శాశ్వతలోకము

జేరు మార్గ మెట్టిదాయని అన్వేషించినాడు. "కృత్రిమ పద్ధతులకు కట్టుబడిన జీవితము దూష్యమని భావించె నాడు. జీవికి స్వేచ్ఛ అవసరము. ఆ స్వేచ్ఛ ప్రయ త్నించినపుడే లభ్యమగును. నిరాటంకముగ నొనర్చు ప్రయత్నమే ఫలించును. మానవుని స్వేచ్ఛ కడ్డు వచ్చు ప్రతిబంధనము విచ్ఛేదము కావలెను. ఈ 'నా' అను వారి నందరిని విడిచిపెట్టుట శ్రేయస్కరము. లేనిచో వారి అనురాగము, బంధుత్వము శృంఖలముల వలె నంటిపెట్టుకొని అడుగడుగున అడ్డము పడుచుండును" అని నిశ్చయ పరచుకొనినాడు.

రా:—సిద్ధార్థుని ఆవేదన అతనితండ్రికి, భార్యకు తెలియదా?

తం:—తెలియును. అతనితండ్రి అనేక కట్టుబాట్ల నొనర్చి నాడు. కుంటివాడుగాని, గుడ్డివాడుగాని, ఎలాటి వికలాంగుడుగాని, విషాదగ్రస్తుడు గాని, క్షుధాపీడితుడు గాని, సిద్ధార్థుని కంటబడకూడదని శాసించెను. కుమారుడు ఎచటికి వెళ్ళినను పట్టణ మంతయు నలంకరింప వలసినదిగా ప్రజల నాజ్ఞాపించెను. చనిపోయినవారి దహన సంస్కారములను సైతము రాకుమారుడు గృహోన్ముఖుడగునంతవఱకు జరుగకుండ కట్టుదిట్ట మొనరించెను. భార్య ఎల్లప్పుడు భర్తృసేవలో నిమగ్నమై యుండెడిది. కంటికి రెప్పవలె సిద్ధార్థుని వెనువెంటనే తిరుగుచుండెడిది.

రా:—ఇక సిద్ధార్థుని విచారమునకు కారణ మేమి ?

తం:—సత్యాన్వేషణకు బూనికొనినవానికి విరామ మనవస రము. ప్రతి విషయమును కూలంకషముగ పరిశీలించు చునే ఉండును. సిద్ధార్థునికి అలంకారములతో పని యే మున్నది ? అతనికి కావలసినది వాస్తవముగ జరుగుచున్న మానవ జీవిత కలాప వృత్తాంతము. ఏ దృశ్యములను రాజు నిషేధించెనో, వానినే సిద్ధా ర్థుడు ప్రత్యక్షముగ నీక్షించెను. మానవజాత్యుద్ధర ణకై జన్మించిన అతని హృదయము ఆ దృశ్యముల వలన విషాదపూరిత మైనది. క్రిమ్ముకొనిన మేఘ ములు వర్షించి కంటికి కనబడకుండపోవును. అదే విధ ముగ మహాత్ములు లోకము నుద్ధరించి దేహములను చాలింతురు.

ఒకనాటి రాత్రి అందరు నిద్రించుచున్న సమయ మున సిద్ధార్థుడు రాజసౌధమును దాటి బైటికివచ్చెను. వచ్చుటకుముం దెంతయో మానసికా వేదనకు గురి యయ్యెను. యశోధరసౌందర్య మతనిని ముందుకు సాగనివ్వకుండెను. కాని కావించుకొనిన నిశ్చయము ముందుకు నెట్టుచుండెను. మూడుసార్లు ముం దడు గిడెను ; మరల వెనుకకు వచ్చెను. యశోధరసౌందర్య మంత ఆకర్షణీయ మైనది. సిద్ధార్థునికి ఆమెపైగల ప్రేమ అంత గాఢమైనది. చివఱకు చెదరని నిశ్చయ ముతో ముందు నడచెను. గాఢాంధకారము. వెన్నెల

రాత్రి కాదు. నిశాదేవత తెల్లనిచుక్కల కన్నులతో అతనిపై ప్రేమ వృష్టి కురిపించినది. పరిసరించిన వాయువు అతని కాషాయాంబర పుటంచులను స్పృశించి ముద్దాడినది. ఉద్యానవనమునందలి పుష్పములు తెల్ల వారకుండగనే అతనిపై సువాసనలు గుబాళించు టకై వికసించినవి. చిరకాల మెదురుచూచిన శుభ తరుణము దాపురించిన దను సంతృప్తి దెలుపుచు ఆసేతుశీతాచలము భారతధరిత్రి కదలబారినది. ఇంకను అనేక శుభసూచనలు పొడగట్టినవి. చెన్నునితో గుఱ్ఱ మును సిద్ధపరచవలసినదిగ చెప్పెను.

రా:—సన్యసించుటకు గుఱ్ఱము కావలెనా ?

తెం:—తెల్లవారుటకుముందుగ సిద్ధార్థు డెంతో దూర మేగిన గాని అనుకొనినపని నిర్విఘ్నముగ కొనసాగబోదు. కనుక గుఱ్ఱమును సిద్ధముగ నుంచవలసినదిగ ఆజ్ఞా పించినాడు.

రా:—చెన్నుడు చెప్పిన దానిని శిరసావహించినాడా ?

తెం:—"ఈ గాఢాంధకారమున మార్గము కన్పడదు. ఎచటికి వెళ్ళదలచిరి" అని ముందు ప్రశ్నించినాడు. అప్పుడు సిద్ధార్థు డతనితో "మెల్లగ మాట్లాడుము. గుఱ్ఱమును వెంటనే తీసికొనిరమ్ము. ఈ చెరసాలనుండి తప్పించు కొని బయటపడు సమయము వచ్చినది. ఇంకెంత కాలము పంజరమునందు బంధింపబడిన పక్షివలె

బాధపడగలను ? సత్యాన్వేషణ నా ప్రధానలక్ష్యము. అది నా యొక్కనికొఱకే లేదు. మానవజాతి కంతటికి ఉపయోగపడ కలదు. నా ప్రయత్నము ఫలించు నంత వఱకు విశ్రమింపబోను." చెన్నుని కిదంతయు గ్రాహ్యము కాలేదు. అందువలన "ప్రభూ ! మీరు మహారాజాధిరాజులు కాగలరనియు, మీ కీర్తి నల్దిక్కులకు పాకగలదనియు, ఎందఱో శాస్త్రజ్ఞులు చెప్పియుండిరి. మీరీ రాజ్యమును, సంపదలను పరిత్యజించి భిక్షాటనకై వెళ్ళదలచుట న్యాయముగ నున్నదా ?" అని అడిగెను. సిద్ధార్థుడు మందహాస మొనర్చి "రాజ్యభోగము లనుభవించుటకు నేను జన్మించలేదు. ఐహిక సంపదలు శాశ్వతములు కావు. మానవజాతి శాశ్వతమైన ఆముష్మిక సౌఖ్యము ననుభవించుటకు మార్గ మన్వేషించుచున్నాను. ఐశ్వర్యము బ్రతికి యున్నంతవఱకే అనుభవయోగ్య మగును. మరణించిన వానికి ఐశ్వర్యముతో పని ఏమున్నది ? ధనవంతు డైనను, నిరుపేదయైనను మరణింపకతప్పదు. మృత్యువునకు తారతమ్యములు లేవు" అని నచ్చజెప్పెను. చెన్నునకు సిద్ధార్థుని మహాదాశయము లర్థము కాకుండుటలో వింతలేదు. అతడు సాధారణ మానవుడు. ఐహిక భోగముల కఱ్ఱులు సాచు స్వభావము కలవాడు. మమకారములతో జీవితమును గడుపుచుండినవాడు. కనుకనే "మీరు వెళ్ళిన తరువాత మహారాజెంతగ దుఃఖించునో ఆలోచించుకొనుడు.

అమ్మగా రెట్టి పరిస్థితికి లోనగునో భావించుము. మిమ్ములను హృదయపూర్వకముగ ప్రేమించు బంధువులకు దుఃఖము కలుగునటుల ప్రవర్తించిన మీరు మానవజాతికి సమకూర్చు శాశ్వతానందమేమి కలదు?" అని ప్రశ్నించెను. సిద్ధార్థుడు స్నేహభావముతో నిట్లు సమాధానపరచెను. "మిత్రమా! బంధుప్రేమ శాశ్వతమైనది కాదు, సత్యమైనది కాదు. ప్రతిఫలము నపేక్షించిన ప్రేమ తుచ్ఛమైనది. నన్ను, నా బంధువులను, మానవజాతిని నాశన మొందకుండ జూచుటకే అందరిని, అన్నిటిని వదలి వెళ్ళుచున్నాను. ఇక నాతో ప్రసంగించ నవసరములేదు." చెన్నుడు తెచ్చి నిలిపిన ఉత్తమాశ్వము నెక్కి సిద్ధార్థుడు సత్యాన్వేషణార్థమై బయలు దేరెను. అతని మార్గమునెంబడి దేవతలు పూలవర్షము కురిపించిరి.

రా:—పూలవర్ష మెట్లు కురియును? మన మెన్నడు దానిని చూడలేదు కదా!

తం:—సంతోష సమయములందు దేవతలు పైనుండి పూలను గురిపించుటనే పూలవర్షమని చెప్పుట కలదు. ఎవరైన ప్రముఖ నాయకుడు వచ్చినపుడు స్త్రీ పురుషులు మేడలమీద నిల్చొని అతనిపై విడిపూలను కురిపించుట మనము విన్నసంగతే. మానవులు మానవులపై పుష్పములను గురిపించుట గొప్పవిషయము కాదు. కాని మానవునిపై దేవతలు పుష్పవృష్టి గురిపించుట

అసాధరణ విషయము. మన మేమంత గొప్పవార మని పూలవర్షము కురిపించుకొనగలము. అభిమానము కొలది మానవులు పూలను గురిపింతురు. లోకకళ్యాణమునకు జీవిత మంకితముజేసి విజయము సాధించిన మహాపురుషునిపై గల ఆదరాభిమానములను దెలుపుటకై దేవత లతనిపై పుష్పవృష్టిని గురిపింతురు.

సిద్ధార్థుడు మానవజాత్యుద్ధరణకై సర్వసంగ పరిత్యాగ మొనర్చి బయలుదేరినందున దేవత లత నధిగమించు మార్గమునం దంతటను పూలను గురిపించిరి. ఆ కారణమున గుర్రపుడెక్కల చప్పు డెవరికి వినిపించకుండెను. రాత్రింతయు ప్రయాణ మొనర్చి తెల్లవారు ఝామున గుఱ్ఱమునుండి దిగి, చెన్నుని బిలిచి "నీపై నాకు గల ప్రేమ అపారము. నీ సేవాభిరతి ప్రశంసనీయమైనది. నీ విక నగరమున కేగుము. నన్ను మఱచిపోవలసినదిగను, తిరిగి వచ్చు అవకాశ ముండిన అలభ్యమైన విజ్ఞాన సంపదను గడించి యావద్ధాత్రి కధిపతినై రాగలననియు, నాలో ప్రేమ మినహా వేరే ఇతర భావము లేదనియు మా తండ్రికి విన్నవించుము. ఇక సెలవు" అని ప్రియమార నుదోబ్ధించెను. చెన్నుడు వెళ్ళిన తరువాత సిద్ధార్థుడు చాల దూరము నడచి ఒక తపోవనము జేరుకొనెను. గ్రీష్మతాపమునకు, వర్షపాతమునకు, విదళించు శీతువునకు అతని దేహాము గురియైనను పట్టుదల ఏ మాత్రము

సడలకుండెను. మానవు లందరితరఘున ఒక కాషాయ వస్త్రము ధరించి, ఎవరైన బుద్ధిపుట్టి ఒసగిన ఆహార



భిక్షు గైకొనుచున్న సిద్ధార్థుడు

మును గైకొనుచు, రాత్రిపూట తృణశయ్యపై మేను

వాల్చి నిద్రించుచు, నిద్రా భంగము కలుగుటకు కారణమైన ఏ నక్క అఱపులనో, ఆకటి మంటకు తట్టుకొనజాలక అటునిటు తిరుగాడు పులుల గాండ్రింపులనో వినుచు భయము లేకుండ కాలము బుచ్చుచు, సిద్ధార్థుడు స్థిర సంకల్పముతో తపము సాగించెను. ఎందరో సాధుపుంగవులను, తపోనిధులను సందర్శించి తా నెఱుగదలచినది వారివలన లభించనందున, స్వయంకృషిపై నాధారపడెను. వారి ఉపన్యాసములు ఆచరణ విధాన ములతనికి నచ్చలేదు. నైతిక శక్తి వారిలో లోపించినదని గ్రహించెను.

ఆ తరువాత సిద్ధార్థు డొక విఖ్యాత బ్రాహ్మణోత్తముని ఆశ్రమమున ప్రవేశించి, అతనివలన అనేక విషయములను దెలిసికొనెను. ఈ క్రొత్త అంతేవాసికి గల విజ్ఞానతృష్ణ నెఱిగి ఆ బ్రాహ్మణు డెంతయో సంతసించి శాశ్వతముగ తనవద్దనే ఉండవలసినదిగ కోరెను. ముక్తి ప్రాప్తించుటకై మానవు డొంటరిగ సన్మార్గగామియై జీవితము గడుపవలసి యుండునని సిద్ధార్థు డతనివలన తెలిసికొనెను. ముక్తి వ్యక్తిగత మగుట సిద్ధార్థుని కిష్టము గాకపోయినది. అట్టిముక్తి కొఱకై అతడు సర్వము పరిత్యజించి అరణ్యములలో నివసించవలసిన పనియే లేదు. అతడు కోరినది మానవ జాతి కంతటికి అందుబాటులోనుండు ముక్తిమార్గము. అందువలన సిద్ధార్థుడు ఆ ఆశ్రమము వదలి మరొక

చోటికి బయలుదేరెను. మగధ రాజధానికి సమీపమున గల ఒక ఎత్తైన కొండమీద పర్ణశాల నేర్పరచుకొని సహాధ్యాయులతో గూడి భగవద్ధ్యానము సేయుచు సిద్ధార్థుడు కొంతకాలము గడపెను. దేహమున నేక విధముల శుష్కింపజేసెను. దైహిక మానసిక శక్తులు విజృంభించినంత మాత్రాన ముక్తిజ్ఞాన మలవడదని గ్రహించి శుష్కోపవాసములను విడిచిపెట్టెను. ఈ సాధనవలన అతని కీర్తి మెల్లగ వ్యాప్తమయ్యెను. మగధాధీశుడు బింబిసారుడు సిద్ధార్థుని ఆశ్రమమునకు వచ్చి, సుకుమార సుందర దేహుడై, పరిపూర్ణ యౌవనుడై, మహారాజలక్షణ లక్షితుడై, సర్వస్వము త్యజించి సర్వమానవాభ్యుదయార్థమై తపమొనరించుచుండుట జూచి అత్యంతాశ్చర్యము జెందెను.

ఆనాటి పండితుల వాగ్వివాదములు, ఆచరణ శూన్యములైన దీర్ఘోపన్యాసములు సిద్ధార్థునికి బాధ కలిగించినవి. తాము స్వయముగ ఆచరింపజాలని కఠిన నియమములను ఇతరులకు బోధించుట వారి అవివేకమునకు ప్రత్యక్ష నిదర్శనమని నిరసించెను. విశ్వాసము, ఉత్సాహము, పట్టుదల, జ్ఞాపకశక్తి, కేంద్రీకరణ శక్తి, శాస్త్రవిజ్ఞానము కలిగియున్న వానికి ముక్తి కరతలామలక మగుననుటలో అతనికి సత్యము తోచలేదు.

ఇతరులనడిగి తెలిసికొనుటకన్న, స్వయంకృషి నొనర్చి విజ్ఞానము గడించుట శ్రేష్ఠమని నిశ్చయించు



స్పృహతప్పి పడిపోయిన సిద్ధార్థునికి శిష్యులు పరిచర్య జేయుట.

కొని అనేక మార్గములలో అనేక విధములుగ జిజ్ఞాసా

పరమైన పరిశోధనలను గావించెను. ఇంద్రియములను జయించుటకై అన్నపానీయములను ముట్టకుండ నుండెను. ఒకనాడు సిద్ధార్థుడీ పరిశోధన ఫలితముగ స్పృహతప్పి పడిపోయెను. అతని శిష్యులు మరణించె నని భావించి నలుగురితో సిద్ధార్థుని విషయమై తెలియ జెప్పిరి. కాని గండముగడచి సిద్ధార్థుడు తెలివొంద గలిగెను. మరికొన్ని వేళలందు అతడు సర్వముమరచి అంతర్ముఖుడై అనిర్వాచ్యానందము ననుభవించెను. శరీరము శుష్కించినను, అతని ఆత్మ పరిపూర్ణ వికా సము గాంచగలిగినది. ఎందరో యువతు లతనికి పాలు వెన్న తెచ్చి యిచ్చిరి. ఎప్పటివలె, ఆ కారణ మున, నతని దేహము పరిపుష్ట మయినది. నమ్మి కొనిన వానిని భగవంతు డెన్నడు చెరచడుకదా! రాజసౌధమును వదలిన ఆరేండ్లవఱకు సిద్ధార్థుడనేక విధముల సత్యాన్వేషణ మొనర్చెను. నిరంతరకృషి ఫలితముగ క్రమముగ నతనిలో పూర్వజన్మ స్మృతి, అంతర్దృష్టి, దైవవిలాసానుభూతి, సృష్టిరహస్య విజ్ఞా నము సిద్ధించెను. ఆపైన నిత్యసత్యస్వరూప దర్శన భాగ్యము ప్రాప్తించెను. అంతవఱ కతడు బోధి సత్వుడు. ఇకముందు బుద్ధుడు. బుద్ధుని కొక ప్రత్యేక వ్యక్తిత్వము లేదు. ఏ పేరున నతనిని వ్యవహరించ వలెనో నిర్ణయించుట కష్టము. కనుకనే అతనిని 'తథాగత', 'మహాపురుష', 'సత్యనామ' అను విశేష ణములతో గౌరవించిరి. మానవ దేహముతో

మానవలోకమునందు, మానవాతీతమైన ముక్తిని బడయగలిగిన సిద్ధార్థుడు మానవోద్ధారకుడు. అవతార పురుషుడు. తాను గడించిన అనుభవమును, ఆచరించిన విధానమును, ఆలోకించిన సత్యస్వరూప మాహాత్మ్యమును మానవజాతి కంతటికి దెలియ బరచి పునీతుల నొనర్పదలచి కృతకృత్యుడు కాగలిగిన బుద్ధుడు భగవానుడుగ పూజింపబడు చున్నాడు.

:—బుద్ధు డేమి తెలిసికొనెను ? అతడు మానవులకు బోధించిన విజ్ఞాన మేమి ?

:—మానవుడు తాను చేసిన తప్పిదములవలన బాధపడును. ఇంద్రియములను స్వాధీనపరచుకొనినవాడు సురక్షితముగ నుండగలడు. మెలగు విధానమునుబట్టి ఉన్నతియో, పతనమో కలుగును. జీవిత సౌఖ్యములను అనుభవించుటకై మానవుడు ప్రయత్నించుట వలన, ఇంద్రియములకు లోనై, అక్రమమార్గమున మెలగును. మంచిచెడ్డలనరసి నడచుకొనువానికి పతనము కలుగబోదు. పట్టుదల, సహనశక్తివలన పెట్టుకొనిన ఆశయములు, ఆదర్శములు నెరవేరుచుండును. మానవుని పాపపుణ్యములు, కష్టసుఖములు అతని చర్యలనుబట్టి నిర్ణయ మగును. పుట్టిన జీవి మరణింపక తప్పదు. కాని మరణానంతరము మరల పుట్టుట జరుగకుండ చూచుకొనవలెను.

రా:—చచ్చిన వానిని యోగులు, మహాత్ములు బ్రతికించ జాలరా ?

తం:—సిద్ధార్థుని జీవితమునకు సంబంధించిన వృత్తాంత మొకటి వినిపించెదను. కంటికి కడవెడుగ నేడ్చుచు, ఒక యువతి, చేతులెత్తి మ్రొక్కి సిద్ధార్థునితో ఇట్లనెను:— "ప్రభూ! నా కొక డే కుమారుడు కల్గెను. పూలమధ్య తిరుగాడు పా మొకటి వానిని కరచెను. అటుల జరుగు నని వా డెరుగడు. కాని పాముకాటువలన వాడు వెంటనే మరణించెను. ఎంతమందినో వానిని బ్రతి కించ వలసినదిగ ప్రార్థించితిని. ఎవరు నా కోరిక నెర వేర్పరైరి. మీ పేరుచెప్పి ఇచటికి వెళ్ళవలసినదిగ ఒక పుణ్యాత్ముడు సలహా ఇచ్చెను. కొండంత ఆశతో మీ దగ్గరకు పుత్రభిక్షకై వచ్చితిని. మీరు తలచు కొనిన నా కుమారుని బ్రతికించగలరు. వాడు లేనిది నేను బ్రతుకలేను." సిద్ధార్థు డామెతో "చావు సంభ వించని ఏ గృహమునుండైన ఒక తులము ఆవగింజలు తేవలసినదిగ చెప్పెను. ఆ స్త్రీ ఇంటింటికి వెళ్ళి విచా రించెను. ఆవగింజలు పెట్టుట కందరు సిద్ధముగనే ఉండిరి. కాని ప్రతియింటిలో ఎవరో ఒకరు అంతకు పూర్వము మరణించుట వలన ఆమె ఎక్కడినుండి ఆవగింజలు గైకొనలేదు. విసుగుతో, విచారముతో సిద్ధార్థుని దగ్గరకు వచ్చి జరిగిన దంతయు వినిపించెను. అపుడు సిద్ధార్థుడు సానుభూతితో "సోదరీ! మృత్యువు

నుండి తప్పించుకొను మార్గము నన్వేషించు నాకింతవరకు వెలుగు కనిపించలేదు. నీ కొడుకు నెట్లు బ్రతికించగలను? ఒక సంగతి జ్ఞాపక ముంచుకొనుము. నీ సమక్షమున పారాడుచు కనులపండువుగ ఆడుకొనిన బాలుడు నేను దూరమైనాడు. ఆ కష్టమువలన నీకు చెప్పనలవికాని బాధ కలిగినది. నీవలె ఇంతకుముందు



పుత్రశోకము నదుఃఖించు యువతి నోదార్చుచున్న సిద్ధార్థుడు.

ఎందరో బంధునష్టముతో బాధపడిరను సత్యము స్వయముగ తెలిసికొనియుంటివి. ప్రాణులందరికి మృత్యువు రాక తప్పదు" అని ఓదార్చి పంపెను.

రా:—మన మందరము ఏ విధముగ మెలగవలెనని ఆయన బోధించినాడు ?

తం:—ఏ ప్రాణికి నష్టము కలిగించకుండ, ప్రేమభావమున మెలగవలెను. ప్రాణులమధ్య తరతమ భేదము లుండ కూడదు. ఆశను, కోపమును విసర్జింపవలెను. ఇతరుల హృదయములు బాధపడునట్లు మాట్లాడుట మాన వలెను. శాంతముగ, సరసముగ సంభాషించుట ముఖ్యము. మనముచేయు ప్రతిపని ధర్మబద్ధముగ నుండుటయే గాక, ప్రేమ కలిగించు నట్టిదిగ ఉండ వలెను. అంతఃకరణము పవిత్రముగ నుంచుకొన వలెను. ఇతరుల క్షేమలాభములనుగురించి ఆలో చించ వలెను. దుర్జనులకు దూరముగనుండి ధర్మ చింతనతో కాలము గడుపవలెను. ఆత్మానంద మనుభ వించుట కనుక్షణము జాగరూకతతో మెలగవలెను. ఆత్మ విహంగమువంటిది. రెక్కలు రాకమునుపే ఎగు రుటకు ప్రయత్నించు పక్షి క్రిందబడునట్లు, సక్రమ ప్రవర్తన కలవాడని జీవి ఊర్ధ్వగామి యగుటకు ప్రయ త్నించినచో అధఃపతనము తప్పదు. ఆకాశము విశాలమైనది. పై కెగిరినకొలది వాతావరణము సుఖ కరముగనే ఉండును. కాని తగినంత శక్తి సంపా దించుకొనజాలని పక్షికి ఇష్టము వచ్చినంత ఎత్తున కెగిరి వెళ్లుట ఎట్లు సాధ్యము కాగలదు ? భార్యా పిల్లల ప్రేమ మరువరానిది యనుట కాదనను. కాని

వారిపై మనకు గల మమకారము ఆత్మోన్నతికి అడ్డము రాకుండ చూచుకొనవలెను. మమకారముతో కాలమంతయు గడపినవారికి బంధనములు తప్పవు. బంధనములవలననే ప్రాణులకు పునర్జన్మ లభించుచుండును.

రా:—భార్యను, పిల్లలను వదలి స్వార్థముతో పాటుపడిన వానికి ఉన్నతి కలుగు టెట్లు?

తం:—లోకములో ప్రతివ్యక్తి "నా" అను భావముతో మెలగుచుండును. ఈ భావముకలవానికి విశాలదృష్టి కలుగబోదు. అందరిని ప్రేమించుట, సమానదృష్టితో జూచుట, స్వార్థ మనిపించుకొనదు. భార్యా పిల్లలు కలవానిని సన్యసించవలసినదిగా సిద్ధార్థుడు ఆదేశించ లేదు. గృహస్థులైనప్పటికి, ధర్మచింతన కలిగి, ప్రాణుల నందరిని ప్రేమభావమున జూచుచు, ధర్మ మార్గమున మెలగినచో బంధనవిముక్తి లభించగలదని ఉపదేశించినాడు.

గా:—ప్రేమభావ మన నేమి? దాని నెట్లు ఆచరణలో ప్రదర్శింప గలము?

తం:—శరీరాకృతులు వేరైనను, అన్ని జీవులు సమాన లక్షణములనే కలిగియున్నవని ఎఱిగి వానిపై ప్రేమ జూపించి మెలగుట అని అర్థము. సిద్ధార్థుని జీవిత ఘట్టముల నుండి మనము ఉదాహరణము గైకొనవచ్చును.

ఒకనాడు గొఱ్ఱెలమందను తోలుకొనిపోవు కాపరిని పిలిచి సిద్ధార్థుడు వాని నెచటికి దీసికొని వెళ్లుచున్నా వని ప్రశ్నించెను. అందుల కతడు రాజు తలపెట్టిన జంతుబలిని గురించి దెలియజేసెను. సిద్ధార్థు డొక గొఱ్ఱెపిల్ల నెత్తుకొని వానివెంట వెళ్లెను. రాజధాని జేరుకొన్న సిద్ధార్థుని జూచి సైనికులు భక్తిభావముతో వెనుకకు తగ్గిరి. వాగ్వాదములతో వ్యాపారము జరుపు వర్తకులు నిశ్శబ్దముగ అతని ముఖవర్చస్సు జూడ జొచ్చిరి. ఎత్తినసుత్తె నట్టే పట్టుకొని కమ్మరులు, మగ్గమునుండి లేచివచ్చిన సాలెలు, వ్రాయు కలము నాపిన లేఖకులు, లెక్కపెట్టిన నాణెములసంఖ్య మఱచిన వ్యాపారస్థులు, సిద్ధార్థుని దర్శనమునకై ప్రేక్షకు లాడిరి. బియ్య మెంతసేపటినుండి తినుచున్నను ఆబోతు నదలించుభావము దుకాణములో నున్న వారికి కలుగలేదు. పిదుకుచున్న పాలు పాత్రనిండి పొరలిపోవుచున్నను గమనించని గృహస్థుని చిత్తము సిద్ధార్థుని దర్శనమునకై తహతహలాడెను. రాజునకు సర్వ మెరిగింపబడెను. విశాలమైన గదికి నడుమభాగమున గుండమునందు అగ్ని ప్రజ్వరిలుచుండెను. దానికి సమీపమున రాజు, రెండు వైపుల మంత్రములను పఠించుచున్న బ్రాహ్మణులతో నిలిచి యుండెను. ఆ గుండము చుట్టునున్న మట్టి రక్తసిక్తమై యుండెను. కొద్ది దూరములో ఒక మేక బలికి సిద్ధముగ నుంచబడెను. పురోహితుడు దానిని కత్తితో నరుకబోయెను.



సిద్ధార్థుని దర్శనముతో శరీరములనే మఱచిన వర్తకులు మొదలగువారు.

అప్పుడు మృదువుగ సిద్ధార్థుడు రాజుతో ఇట్లనెను. "రాజా! జంతువధ నాప్రము. దానివలన కలుగు సుకృతము శూన్యము. నోరులేని ప్రాణులను హింసించుట పాపము. పైనబడి బంధించు మానవు నెదిరించు శక్తిలేనంత మాత్రమున ఈ మేకకు ప్రాణముపై తీపిలేదని భావించుట పొరపాటు. అల్పజీవుల యెడ కరుణతో మెలగవలెను. దేవతల అనుగ్రహము సంపాదించు కోర్కెతో నోరులేని జంతువులను వధించుట ఎంత నీచము? ఈ జంతువులు మనకు చేసిన అపకార మేమి? వానివలన మనకు అనేకవిధముల లాభము కలుగుచున్నది. పెంచి పోషించెదరని అవి మానవులపై విశ్వాసము కలిగియుండును. ఆ విశ్వాసమున కర్హులముకామని తెలుపుటకై వానిని, మనము సుఖపడవలెనను ఆశతో చంపుట యేనా, ఈ బలి దానముయొక్క ముఖ్యోద్దేశము? నమ్మిన ప్రాణులనుగొంతుకోయుట మానవత్వమునకు నిదర్శనమేనా? రక్తస్రావమువలన పాపములు తుడుచుకొని పోవు. దేవతలు రక్తదాహము కలిగి యున్నారనుకొనుట అజ్ఞానము. వారికి జంతుబలితో నిమిత్తము లేదు. పాపులవలన వారికి లంచములు సంక్రమించుట కల్ల. ఒంటరిగ జేసినను, కలిసి చేసినను, పాప మందరికి సమానముగ ప్రాప్తించును. జరుపుచున్న జంతు హింసకు మీరు సమాధాన మొసగవలసి యుండును. సృష్టిలో ప్రాణుల చర్యలనుబట్టి పాపపుణ్యములు

నిర్ణయింపబడును. హింసవలన పాపము, ప్రేమవలన సుకృతము లభించును. కావలెనని పాపము నేల ఒడి కట్టుకొందురు?" ఆ వాక్యములతో అందరు నిరుత్తరులై తాము తలపెట్టిన కార్యము విడిచిపెట్టిరి. ఆనాటినుండి రాజు తన దేశములో జంతువధను నిషేధించెను.

గా:—ఇందులో సిద్ధార్థుడు స్వయముగ ప్రాణదాన మొనర్చిన దేమున్నది? నీతి బోధించుట సులభమే కదా!

ం:—ఆచరణ యోగ్యములు కానట్టి, లేక స్వయముగ ఆచరించనట్టి, నీతులను సిద్ధార్థు డెన్నడు బోధించి యుండ లేదు. సిద్ధార్థుడు బ్రాహ్మణ వేషముతో సంచరించుచున్నప్పు డొక ప్రదేశమునందు కాటకముచే ప్రజలు మలమల మాడుచుండిరి. జంతువులకు గడ్డి కరవయ్యెను. అతడొక కొండపైన నివాస మేర్పరచుకొని యుండెను. దాని గుహలో పెద్దపులి, పిల్లలతో సహా, ఆకలిమంటకు తట్టుకొనలేక అరచుట మొదలిడెను. ఆకుపచ్చని కాంతితో మెరయు దాని కనులలో క్షుధార్తి ద్యోతక మగుచుండెను. ఎండిపోయిన నాలుకజాచి తడుపుకొనుటకై తల్లడిలుచుండెను. దాని శరీరమంతయు కృశించి ఎముకలు మాత్రమే కన్పడుచుండెను. దాని పిల్లలు ఆకలితో బాధపడుచు, పాలు త్రాగుటకై ప్రయత్నించి నిరాశ జెందుచుండెను. మాతృప్రేమతో పెద్దపులి పిల్లలను నాకుటకు ఆరంభించి, తడి ఆరినందున, బాధతో మాని

వేసెను. ఇదంతయు చూచి సిద్ధార్థు డిట్లు భావించెను. "ఈ పులి, పిల్లలతో సహా, పొద్దుగ్రుంకు లోపలనే మరణింపగలదు. రక్తదాహముతో, దానిని దీర్చుకొను



పెద్దపులికి ఆహారముగా సిద్ధపడిన సిద్ధార్థుడు.

మార్గము శక్తిలేక, బాధపడు దీనిపై ఎవరికి దయ కలుగ గలదు? నా శరీరమును దీని కాహారముగ నొసగినచో ఎవరి కేలాటి బాధ, దుఃఖము లేదు.

ప్రేమకు హద్దులు లేవు, అంతము లేదు. అక్కరకు రాని సౌహార్ద్రము నిష్ఫలము." వెంటనే అతడు లేచి ముందుకు నడచి పులితో "అమ్మా! నీకు ఆహారముగ వచ్చితిని" అని అరచెను. నిశ్శబ్దముగ, నిరాధారముగ మృత్యువు నెదురుచూచు ఆ క్రూరవ్యాఘ్రమునకు ధ్వని వినబడగానే, పిల్లలను వెనుకకు నెట్టి, కోపముతో, ఆశతో, పట్టుదలతో సిద్ధార్థునిపై దూకి గోళ్ళతో, కోరలతో శరీర మంతయు చీల్చి, నెత్తురు త్రాగి, మాంసము కడుపునిండ తిని వెళ్ళిపోయెను.

రా:—పెద్దపులి చీల్చిన తరువాత సిద్ధార్థుడు బ్రతికి యుండెనా ?

తం:—భగవత్కృపగలవానికి ఎన్ని ఆపదలు వచ్చినను నష్ట ముండదు. ప్రహ్లాదుడు చనిపోయెనా ? ప్రహ్లాదు డితరులచే బాధింపబడెను. కాని సిద్ధార్థుడు బుద్ధిపూర్వకముగ బాధకు లోనయ్యెను.

రా:—నాల్గు వర్ణములవారిలో బ్రాహ్మణులు అగ్రగణ్యులని లోగా చెప్పితిరి. సిద్ధార్థుడు క్షత్రియ వంశములో జన్మించియు, తనకు కలిగిన విజ్ఞానము నలుగురికి బోధించునపుడు బ్రాహ్మణులు ప్రతిఘటించలేదా ? బ్రాహ్మణుల ఆచారములతో, ఆచరణ విధానముతో సిద్ధార్థు డేకీభవించెనా ? ఏకీభవించనిచో దానికి కారణ మేమి ?

తం:—సిద్ధార్థుని కాలమున బ్రాహ్మణుల కధికారము ఎదురు లేనిదిగ ఉండినది. వారికి ప్రజలలో అమితమైన ప్రాబల్య ముండెను. మంచిచెడ్డలు రెండింటికి వారే సలహా నొసగువారైరి. అందువలన ప్రజా సామాన్యము వారిమాట నెత్తిపై పెట్టుకొని గ్రుడ్డిగ ఆచరించు చుండిరి. బ్రాహ్మణులను ధిక్కరించి మెలగుట పాపముగ విశ్వసింపబడినది. అంతే కాకుండ కఠిన శిక్షలు ధిక్కార మొనర్చినవారికి విధింపబడు చుండెడివి. తమమాట కెట్టి విలువకలదో గ్రహించిన బ్రాహ్మణులు పట్టపగ్గములు లేక, నిరంకుశాధికారము చలాయించు చుండిరి. ఆనాడు నదులను, వృక్షములను, సర్పములను, పర్వతములను పూజించుట ఆచారముగ నుండెడిది. వృక్షములందు సైతము ఆత్మలు నివసించునను భావముతో ప్రజలు వానికి పూజలు సలుపుచుండిరి.

రా:—వృక్షములకు ప్రాణ మున్నదా?

తం:—ఉన్నదనియే పూర్వులు విశ్వసించిరి. ఇటీవల ఒక ప్రఖ్యాత భారత విజ్ఞాన శాస్త్రవేత్త దానిని నిరూపించి యుండెను. ఆత్మ లుండుటవలన చెట్లకు పూజలొనర్పవలసినదిగా ప్రజలకు బ్రాహ్మణులు నచ్చజెప్పెడివారు. ఆత్మ ఉన్నంతవఱకు చెట్టు పచ్చగ నుండుననియు, వదలిపెట్టిన పిదప ఎండిపోవుననియు వారి ఉపదేశము.

రా:—ఇక మానవులకు, చెట్లకుగల తారతమ్య మేమి ?

తం:—ఆ నాటి బ్రాహ్మణుల దృష్టిలో లేకపోవచ్చును. చెట్లను వదలిపెట్టిన ఆత్మలు మానవ దేహములను ప్రవేశించ వచ్చునట ! చెట్లలోని ఆత్మలను లేక దేవతలను సంతృప్తి పరచుటకై మానవబలి జరుగుచుండెడిది. సంతృప్తి జెందిన కారణమున పూజించినవారి కామ్యములు నెరవేరునట ! సంతానార్థులు, ధనార్జనాసక్తులు, రోగులు, నిర్భాగ్యులు తమ కోరిక లీడేరుటకై మూఢనమ్మకముతో పూజించుచుండిరి. సామాన్యప్రజలే గాకుండ బ్రాహ్మణులు సైతము వృక్షపూజ సలిపెడివారట ! ఈ నమ్మకమున కొక ఆధారము చెప్పబడినది. విశ్వవ్యాపితమైన ఆత్మ వృక్షముగను, అనంత ప్రాణికోటిలో నుండు ఆత్మలు విశ్వాత్మయొక్క శాఖోపశాఖలుగను వర్ణింపబడినది మూలాధారముగ భావించి బ్రాహ్మణులు వృక్షపూజ నాచరణలో పెట్టిరి.

రా:—సిద్ధార్థుడు అశ్వత్థ వృక్షము క్రిందనే గదా సత్య స్వరూపము నెఱిగి బుద్ధుడు కాగలిగినది ! ఇక వృక్ష పూజను నిరసించుట దేనికి ?

తం:—అశ్వత్థ వృక్షముక్రింద సిద్ధార్థునికి సత్యస్వరూప విజ్ఞానము లభించినమాట వాస్తవమే. కాని దానికి కారణము వృక్షముయొక్క మాహాత్మ్యము కాదు. ఆ శుభ

సమయమునకు సిద్ధార్థుడు వృక్షముక్రింద ఆసీనుడై యుండుట జరిగినది. ఎంతైన శ్రమకోర్చి పట్టుదలతో తలపెట్టినపని కొనసాగించి విజయము సాధించిన వానికి రావలసిన కీర్తి, పూజ్యత వృక్షమున కంట గట్టుట మూర్ఖుని లక్షణము. బుద్ధునివలన అశ్వత్థ వృక్షమునకు పూజ్యత కలిగినది. ఈ సంగతి మరువ కూడదు. తపము చేయవలసినదిగ బ్రాహ్మణులు బోధించెడివారు.

రా:—తప మనగా నేమి? దాని వలన కలుగు లాభము లెట్టివి?

తం:—బాధలతో శరీరమును కృశింపజేయుటయే వారి దృష్టిలో తపశ్చర్యగ దోచెను. అరణ్యములకేగి, ఆకులలముల భక్షించుచు, ఓర్చుకొనుదాక శరీరమును బాధకు గురిజేసి దివ్యశక్తులను సంపాదించవలెనని బ్రాహ్మణులు బోధించుచుండిరి.

రా:—దివ్యశక్తు లనిన అర్థ మేమి?

తం:—లౌకిక విజయములను సాధించుట కుపకరించు శక్తులు. అనగా వర్తక వ్యాపారములందు లాభము గడించుట, ఇష్టముకాని వ్యక్తులకు అపకారము కలిగించుట, సంతాన మపేక్షించుట మొదలగు కామ్యములను సిద్ధింపజేసికొను మార్గ మెరుగుట, తనకు చేతకాని పని దేవతలతో జేయించుకొనుట.

:—ఎందు కొఱకు తప మాచరించెదరు ?

:—తప మాచరించుట సామాన్యము కాదు. దానికి బూనుకొనుటకు ముందు ప్రతి వ్యక్తి కొన్ని నియమములను పాటించవలసి యుండును. ఏదో ఒక ఆదర్శము పెట్టుకొని దానిని సాధించుటకై తప మాచరించబడుట సాధారణ విషయము. ఆదర్శములలో తారతమ్యము కలదు. జీవిత సౌఖ్యము నాశించి చేయబడు కృషివలన పునర్జన్మకు పునాదులు వేయబడు ననుట తథ్యము. జనన మరణములవలన కలిగిన బాధానుభవము విస్మరించక, మఱల నది కలుగకుండ జేసికొనుటకై కృషి సలుపుట విజ్ఞానుల లక్షణము. భోగవాంఛ, ఈర్ష్య, అజ్ఞానము మనోవాక్కాయ కర్మలద్వారా పరిత్యజించిన వానికి లోకవు పోకడలతో ఎలాంటి నిమిత్తముండదు. సత్యాన్వేషణ మే అట్టివాని ఆదర్శము. అతనికి ఎప్పు డెటువంటి భయము కలుగబోదు. నిజము నెఱుగగోరువానికి, అనిత్యములైన వస్తువులతో పని ఏమి ? గాలిచే ప్రజ్వలించు అగ్ని నాలుగు మూలలకు ప్రాకి సర్వము దగ్ధ మొనరించునట్లు, కార్యదీక్షతో సత్యాన్వేషణకు బూనుకొని ప్రయత్నించు వాని విజ్ఞానాగ్ని అతనిలోని జడత్వము నంతయు దగ్ధ మొనర్చును. నివురుగప్పని నిప్పుకు గల కాక ఎక్కువకదా ! యావచ్ఛక్తిని బ్రహ్మాపరమైన సత్యమును గ్రహించుటకై వినియోగించు మానవ

వునికి ఎటువంటి నిరుత్సాహము గాని, ఆరాటము గాని, ఆవేదనగాని కలుగబోవు. ఇతరముతో సంబంధము లేకుండ ఏకాగ్రితతో లక్ష్యశుద్ధి కలిగి అంతర్ముఖుడై వర్తించు తపోధనునకు మానసిక వికారము కలుగదు. సాధారణ మానవులు తలచనట్టి, నిర్ధరించుకొన లేనట్టి, ఆచరించ లేనట్టి విధానముద్వారా ఉత్తమ విజ్ఞానమును సంపాదించు కృషిలో దేనిని విడువవలసి వచ్చినను సిద్ధముగ నుండవలెను. కష్టపడకుండ ఫలితము నాశించుట వెఱ్ఱితనము. మంటపుట్టిన గాని మందు పూతవలన పుండు మానిపోదు. విజ్ఞాన మొక్కసారిగ రాదు. దానిని సాధించుటకు నిరంతరము కృషి సలుపవలెను. అన్నము నంతయు నొకేసారి మ్రింగలేనట్లు, విజ్ఞాన ధన మొక్కసారిగ ప్రాప్తించదు. దేనికైన క్రమము తప్పదు. మొట్టమొదట విజ్ఞానము సంపాదించవలెనను ఆకాంక్ష కలుగవలెను. ఆకాంక్ష విశ్వాసముపై ఆధారపడియుండును. ఆకాంక్ష రోజు రోజు పెరుగుటవలన అజ్ఞానయుతమైన పనులను వదలిపెట్టుట జఱుగును. అజ్ఞానము తొలగనిది విజ్ఞానము కలుగదు. వెలుతురు రానిది చీకటి తొలగునా? ఆకాంక్షతో వినిన, నేర్చిన విషయముల నాలోచించుకొను నేర్పు కలిగిన నాటినుండి బుద్ధి వికసించి విజ్ఞాన తృష్ణ వృద్ధిజెందును. నిరంతరము భావించుచున్న కారణమున ఆలోచనల కొక స్వరూపము వచ్చును. మొదట అస్పష్టముగ గోచరించిన ఆ స్వరూపము

క్రమశః బలపడి విస్పష్టమగును. ఈ పరిణామ దశలో సాధకుని హృదయము ఆనందముతో చెంగలించును. ఇంద్రియములను అరికట్టుట ముఖ్యము. అవి కట్టు బడిన తరువాత శరీరమునందు వానివలన కలుగు సంచలనము నశించును. ఆలోచనలు ఆదర్శమునకు వ్యతిరేకముగ, భంగకరముగ నుండకూడదు.

రా:—ఆలోచించు నేర్పు మానవుడు వదలుకొనినచో ఇక అతనికి పశువునకు గల భేద మేమి ?

తం:—దుష్టాలోచనలను వదలవలయు నని గ్రహించుము. దొంగతనము కూడదనుటవలన దానము చేయకూడదని అర్థమా ?

రా:—రుచులను పాటించక, దేహమును నిలబెట్టుకొనుటకై తిండి తినవలె ననుట సాధ్యమేనా ? తిన దలచినది తినుట దోష మెట్లగును ?

తం:—మానవులలో రెండు తెగలువారు కలరని చెప్పుట లోకసహజము. మొదటి తెగలోనివారు తినుటకొఱకే జీవించుదురు; రెండవ తెగవారు బ్రతుకుటకై తిందురు. ఇందులో భేద మెంతో కలదు. ఆహారము నియమబద్ధముగ ఉండవలెనని వైద్యులు చెప్పుదురు. నియమము లేకుండ జిహ్వాచాపల్యముతో ఎప్పుడు పట్టిన నప్పుడు ఇష్టము వచ్చిన పదార్థమును అరిగినను, అరుగక పోయినను తినువాడు రోగముల పాలు కాక

తప్పదు. వాక్కు కలదని ఇతరులను మన యిష్టము ప్రకారము దూషించిన నెట్టి పరిణామము గలదో ఊహించుకొనుము. చూడ జాలనంతటి కాంతిని, కనులు చూచుటకే కలవని, చూచినచో దృష్టి చెడి పోవును. దేనికైనను పరిమితి యనునది కలదు. భగవంతుని ఊరేగింపు చూచుటకు, శవము నూరేగింపు చూచుటకు భేదము లేదా ?

భగవంతుని పూజించుటకు ఏర్పడిన నియమము లను పాటించుటలో శ్రమ లేకపోలేదు. కాని దానిని సంతోషముతో ఓర్చుకొనవచ్చును. ఇతరులను వధించుటకై సలుపవలసిన కృషి, ఓర్చుకోవలసిన శ్రమతో దానిని పోల్చుట సమంజస మగునా ? కాబట్టి మంచి చేయుటలో హద్దులను పాటించక, చెడుగు చేయుట పూర్తిగ మానలేకున్నను సజ్జనత్వము అలవరచు కొనుదనుక దుష్టుడైనను కొన్నిహద్దు లేర్పఱచుకొని వాని నుల్లంఘించకుండి మెలగుటవలన కొంత కాలానికి చెడుగునే విడువవచ్చును. నిద్రించుట సుఖకరము గనే ఉండును. పొద్దస్తమానము నిద్రించుట అసంభవము. నిద్రకై ఎంత ప్రయత్నించినను రాక బాధ పడుట జరుగును. శారీరకముగ, మానసికముగ అలసినవారికి నిద్రపోవుట ముఖ్యము. లౌకిక విషయము లందు దగుల్కొని జీవించు మానవులకు భగవద్ధ్యానము జేయుటకు తీరిక చిక్కదు. యోగుల కలాటి

బాధ లేదు. నిద్ర అజ్ఞానము యొక్క ముద్ర యని వా రెరుగుదురు. వారు తమ జీవితకాలములో సగ భాగము నిద్రించుటకై వినియోగించుట కిష్టపడరు. అజ్ఞానమును దొలగించుకొనుటకై వా రొనర్చు భగీరథ ప్రయత్నములు ఫలించుటకుగాను అనుక్షణము ఏమరుపాటు లేకుండ నుండవలెను. నిద్రించుచున్నట్లు ఇతరులకు కనబడినను, జాగ్రదావస్థను వీడకుండ భగవద్ధ్యాన మొనర్చుదురు.

జ్ఞానులకు స్వాప్నికావస్థతో నిమిత్తము లేదు. వారికి కావలసినది శాంతి. మానవజీవిత మశాశ్వతము. అనుక్షణము సుఖదుఃఖములకు ఆలవాలమై గడచుచుండును. సూర్యు డుదయించుటతో గడ్డిపోచ మీద పడి నిలిచిన నీటిబిందువు ఎటుల ఎండి మాయమగునో, మానవజీవిత పరిణామము అటులనే యుండును. అది నీటిమీది బుడగవలె ఎపుడు మాయమగునో తెలియదు. మరణించిన తరువాత మరల భూమిపై పుట్టుట ఎంత హైన్యము? కనుక ప్రతి వ్యక్తి ఎల్లప్పుడు తన భావినిగురించి ఆలోచించుకొనవలయును.

రా:—ఏమని ఆలోచించవలెను? ఆలోచించిన దెట్లు ఆచరణయోగ్య మొనరించుకొనవచ్చును?

తం:—పూర్వము మానవుడు నూరేండ్లు జీవించుచుండెనని పెద్దలు చెప్పుదురు. ఆ నూరేండ్ల కాలములో ఎన్ని

ఋతువులు, నెలలు, దివారాత్రములు, విశ్రాంతి సమయములు గడిచి పోయెడివో ఊహించు కొనుము. కాలము గడిచినకొలది మానవ జీవితము మార్పు చెందుచుండును. మొదటిదశలు దాటి వృద్ధాప్యము దాపురించును. వృద్ధాప్యమునందు మానవు డశక్తితో క్రుంగిపోవును. అశక్తుని వలన కాదగు పని యేమున్నది? వృద్ధాప్యము రాకతప్పదని అందరము మొదటి నుండి గుర్తెరిగి మెలగవలెను. మానవ దేహమునకు పెరుగుదల, విరుగుదలతోబాటు రోగముల పాలగు అవకాశ మెక్కువగ నుండును. రోగపీడితుడు నిస్సహాయతకు జిక్కి బాధపడుచుండును. అన్నిటిని మించినది మృత్యువు. ప్రాణికి మృత్యు వెన్నడు ఆసన్నమగునో తెలియదు. కాని మృత్యుగవ్వార మెప్పుడు తెరచియే యుండును. నిర్ణీత సమయమునకు ప్రాణి మృత్యువాత బడును. ఇక ఇవ్వాళ సలుపవలసిన భగవద్ధ్యానము రేపటికి వాయిదా వేయుట ఎంత విపత్కరమో గ్రహించుము.

రా:—మృత్యువు గొంపోయిన పిదప ఏమి జరుగును?

తం:—పాప పుణ్యముల విచారణ జరుగును.

రా:—ఎవరు చేసెదరు? ఎక్కడ చేసెదరు?

తం:—పరలోకమునందు, భగవంతుని నియామకము ననుసరించి ఆ విచారణ జరుగును.

రా:—మనము నివసించునది కాకుండ వేఱొక లోకము కంటికి కగుబడనిదే కలదని ఎట్లు భావించవలెను ?

తం:—మన కంటికి అగుబడని కారణమున ఏది లేదని భావించుట తప్పు.

రా:—లేని రోగమును ఆపాదించుకొని బాధ పడుట సమంజస మేనా ?

తం:—రోగము అన్నివేళలందు రాదు. అది సంభవించు నటుల మెలగకూడదు. అపరిమితముగ భుజించినచో కడుపునొప్పి పుట్టునని అనుభవజ్ఞులు చెప్పినదానిని లెక్కచేయకుండ ప్రవర్తించువానికి తిన్నది జీర్ణము కానపుడు ఆ బాధ తప్పక కలుగును. తినుచున్నప్పుడు బాధగ లేదుకనుక మితిమీరి భుజించవలెనని నిర్ణయించుకొనుట బుద్ధిహీనతను సూచించును.

అటులనే మంచి చేసిన పుణ్యము, చెడుగు చేసిన వానికి పాపము ఆపాదించు ననునది లెక్కజేయకుండ మెలగుట వినాశకారణ మగును. దొంగలను విచారించి శిక్షించు కార్యాలయములు ప్రతి దేశమునందు కలవు. ఆ సంగతి ప్రతివానికి దెలియును. తప్పు చేసిన శిక్ష లభించుననియు దెలియును. కాని దొంగతనము జరుగుచునే యున్నది. దొంగతన మొనర్చినవారిలో కొందరు పట్టుబడెదరు. కొందరు తప్పించుకొనగలరు. పట్టుబడినవానికి శిక్ష విధింపబడును. దొంగతనము

శిక్షార్హమని ఎరిగినను దానినే వృత్తిగా బెట్టుకొనిన వా రెందరు లేరు ? పట్టుబడకూడ దను సంకల్పము తోనే దొంగ ప్రవర్తించును. పట్టుబడినను, దొంగ తనము చేయలేదని తప్పించుకొనుటకు ప్రయత్నిం చును. దొంగకు ఇష్టము లేదని న్యాయాధికారి శిక్ష విధించకుండునా ? అటులనే పాప పుణ్యముల విష యమై జరుగును.

రా:—సాక్ష్యమును బట్టి, - అపరాధ నిరూపణమును బట్టి న్యాయవిచారణము జరుగును. పరలోకమునం దెవరు సాక్ష్య మిచ్చెదరు ?

తం:—ఆ లోకమునందు సాక్ష్యములతో నిమిత్తము లేదు. న్యాయవాదులతో ఎలాంటి అవసరము కలుగబోదు. మానవుల నిత్య జీవిత కృత్యము లనుక్షణము పంచ భూతములు పరిశీలించుచునే ఉండును. పగలు సూర్యుడు, రాత్రి చంద్రుడు యావత్సృష్టికి వెలు తురు, వేడిమి, చల్లదనమునే గాకుండ సాక్ష్యము గూడ నొసగుదురు. కనుకనే సూర్యునికి కర్మసాక్షి అని పేరు కలదు. అసత్యము సత్యముగను, సత్య మస త్యముగను మార్చి బుద్ధిబలముతో న్యాయాన్యాయ ముల విమర్శనము జరుపుట కెట్టి అగత్య ముండదు. బ్యాంకులో ఎంత దాచుకొందుమో అంత తిరిగి తీసి కొని అనుభవింపగలము. ఇవ్వబడు వడ్డీ అదనముగ లభించుచున్నది. కాని పరలోకమునందు పుణ్యమై

నను, పాపమైనను నిర్ణయించునపుడు ఎక్కువ తక్కువలు, వర్ణీలు ఉండవు. ఈ లోకమున శిక్ష తప్పించుకొన గలిగినను, పరలోకమున దానిని అనుభవించక తప్పదు. నన్నుచు చేసిన పాపముయొక్క ఫలితాన్ని ఏడ్చుచు మరణానంతరము జీవులు అనుభవింతురు.

రా:—పాప పుణ్యములనుండి తప్పించుకొను మార్గ మేది?

తం:—తప్పించుకొనుట సామాన్యవిషయము కాదు. దానికొఱకు అనుక్షణము, అడుగడుగున, ఆలోచించి, జాగరూకతతో మెలగవలసి యుండును. ప్రాణులు క్రియాశూన్యములు కావు. ఏదోవిధముగ ప్రవర్తించవలసి యుండును. చేయు పనులనుబట్టి పాప పుణ్యవిభేదము పాటించబడును. ఏ పని చేసినను భగవత్ప్రీత్యర్థ మొనరించుచుంటి నను భావము మానవుని హృదయమునందు గాఢముగ నాటుకొనవలెను. అట్టి భావము సుస్థిర మైనచో దుశ్చేష్టలకే తావు లేకుండబోవును. వ్యభిచారము నెవడు పుణ్యప్రద మని భావించి సలుపును?

రా:—ఇక నిత్యజీవితమునందు, సాధారణ మానవు లెట్లు మెలగిన వారి భావి దుఃఖభాజనము గాకుండ నుండగలదు?

తం:—మొదట ఏకాంతవాసమున కలవాటు పడవలెను. మనలో చాల మందికి నిర్జన స్థలమున రాత్రిపూట

ఉండుటకు భయము కలుగును. పాము కరవవచ్చును. తేలు కుట్టవచ్చును. ఆ బాధ ననుభవించలేక చనిపోవలసి వచ్చును. ఇక భగవద్ధ్యాన మెట్లు కొనసాగును? అను సందేహము కలుగును. లేక, క్రొత్తగ దిను ఆహారము విషప్రాయమై ప్రాణహాని కలిగించ వచ్చును. వాతపిత్త శ్లేష్మముల తీవ్రత హెచ్చి కంఠావరోధనము కలుగవచ్చును. శ్వాసకోశములు చెడి ఊపిరి నిలిచిపోవచ్చును. క్రూరమృగములచే భక్షింపబడ వచ్చును. దొంగలచే సంహరింపబడ వచ్చును. భూతములచే పీడింపబడ వచ్చును. ఏదో యొక కారణమువలన మరణము సంభవమైనచో భగవంతుని ఏకాంతవాసమున ధ్యానించు సదవకాశ మంతరించక తప్పదు. ఇక పై చేయునదేమి? అను సందేహములు నిరంతరాయముగ కలుగుచు, భీతిని ప్రాప్తింప జేయును. నలుగురిలో దిరుగువానికి నిర్జన స్థలమున నివసించుట ప్రాణాంతకముగ నుండును. కనుకనే చీకటి బడకమునుపే మానవులు గృహోన్ముఖు లగుచుందురు. ప్రాణతీపికి సాటివచ్చునదేమియు లేదు. ఎట్టి ఆపద సంభవించినను చలించుట కూడదు. మానవు డాశించనిది మృత్యువాక్కటియే. మృత్యువు వలన జీవుడు దేహమునుండి విడివడును. చిరకాలము చెరసాలయం దున్నవానికి దానినుండి విడుదలయగుట ఎంత ఆనందదాయకమో, జీవునికి దేహపరిత్యాగ మంత ఆనంద ప్రదముగ నుండును.

విడువబడిన శరీరమునందు కదలిక గన్పడని కారణ మున దానిని దహన మొనర్చుదుము. దగ్ధము కాబోవు శరీరమును తలచుకొని విచారింతుము. ఇంతకన్న మించిన అవజ్ఞత ఏమి కలదు ? ప్రాణమున్నంతవఱకే మానవరూపమున కొక ప్రత్యేకత కలదు. బాహ్య ప్రపంచము వలన కలుగు హానికన్న మించిన హాని మన ఆలోచనలవలన, ఆచరణవలన మనకుగాని ఇతరు లకు గాని కలుగుట కవకాశ మున్నదా లేదా అని వితర్కించుకొని జీవితవిధానము సరిదిద్దుకొనుట అభ్య సింప వలెను. మరణ మాసన్నమగునప్పటికి స్వాయం కృతాపరాధముల దుష్ఫలితము లెంత భయంకరముగ నుండగలవో దృష్టియం దుంచుకొని మెలగవలెను. ఫలితము లనుభవించక తప్పదు.

రా:—చనిపోయిన తరువాత ఫలితముల నెట్లనుభవింప గలము ?

తం:—తండ్రి చేసిన అప్పులు, అతని మరణానంతరము ఆస్తికి వారసుడు కాబోవు కుమారుడు తీర్చవలసి యుండును. ఆస్తి కావలెను కాని అప్పు లక్కర లేదనుట నిష్ప్రయోజనము. బాకీదారులు వదలిపెట్టరు. వారి ఒత్తిడి కారణమున వడ్డీతోసహా అప్పుపైకము చెల్లించవలసి వచ్చును. ఎవ డార్జించుకొన్నది వాడు అనుభవించక తప్పదు. అపకృతులు జరుగకుండ అనుక్షణము పాటు పడుట బుద్ధిమంతుల లక్షణము. భావించుటతో ఏపని

సమకూరదు. భావించినదానిని లక్ష్యశుద్ధి కలిగి ఆచరించవలెను. ఆచరించుటలో పట్టుదల, ప్రాజ్ఞత, పారిశుద్ధ్యము, ప్రయాస, ప్రతిభ, ధైర్యసాహసములు, సహనము ప్రదర్శించుట తప్పనిసరి యగును. తల గుడ్డకు నిప్పంటుకొన్నచో ఎంత తొందరగ, ఆవేశముతో దాని నార్ప జూచెదమో అంత తొందరగ, పట్టుదలతో మనలో అలవాటు రూపమున ప్రవేశించి వేళ్లు పాతుకొనిపోయిన దుర్గుణములను, దురాలోచనలను రూపుమాపవలెను. పుట్టుట గిట్టుటకొఱకే అను పరమ సత్యము నెపుడు విస్మరించుట తగదు.

రా:—దుర్గుణములను, దురాలోచనలను రూపుమాపు టెట్లు వీలగును ?

తం:—మానవుడు మనసుద్వారా, సంభాషణముద్వారా, కర్మలద్వారా బంధముల నేర్పరచుకొనును. కనుక వానిని వశపరచుకొని మెలగవలెను. మనసు నిలకడ లేనిది. ఎప్పుడు చలించుచుండును. మనసును స్వాధీన పరచుకొనుట కష్టసాధ్యమైన పని. ఇష్టము వచ్చినట్లు పరుగెత్తు ఉత్తమాశ్వమునైన పట్టుకొనగల మేమో కాని ఎచటికైనను, ఎప్పుడైనను సంచరించు మనసును వశపరచుకొనలేము. మనసును స్వాధీన పరచుకొనగలిగినచో దురాలోచనలు కలుగుటకు అవకాశమే యుండదు. ఇక "కాలుజారితే తీసికొన వచ్చును గాని, నోరు జారితే తీసికొనలేము" అను

స్నేహితతో నెల్లప్పుడు మనము జ్ఞప్తియం దుంచుకొనవలెను. మనసు విరిగితే అతుకుట కష్టమని చెప్పుచుందురు. మనసు మాటలవలన విరుగును. దెబ్బల బాధ చిరకాల ముండదు. మనసు గాయపరచినచో బాధించిన వ్యక్తిని చూచినను, చూడక పోయినను, తలచుకొని నపుడు బాధ అనుభావ్య మగుచుండును. మనల నొక వ్యక్తి గాయపరచక పోయినను, నలుగురతనిని దుర్మార్గుడని కాని, హంతకుడని కాని పిలిచినచో మనము అదే పేరుతో, కనీసము అదే భావముతో, అతనిని పిలుచుదుము. సంభాషణ మెపుడు సరళముగను, మృదువుగను, స్నేహవాత్సల్య పూరితముగ నుండవలెను. తిట్టువానిని, కొట్టువానిని ఎవరు గౌరవింతురు ? ఏ సహాయము చేయక బోయినను సానుభూతిని గనబఱచుచు ప్రసంగించినవానిపై ఆపదలలో ఉన్నవానికెంతో ఆదరము కలుగును. స్నేహమున కైనను, వైరుధ్యమున కైనను సంభాషణమే ప్రధాపకారణ మగుచున్నది. మన దృక్పథము నితరుల కెఱిగించుటకు, మనతో వారి నంగీకరింపజేయుటకు ప్రయత్నించుట, సహకరించుట సదాశయములలో నొకటి.. బలవంతముతో ఏ పని నెరవేరదు. కనుక ఇతరులకు నచ్చచెప్పుట తప్పనిసరి యగును. అభిప్రాయభేదము కలుగుట సహజము. దానికొఱకై తగవులాడుట తగనిపని. చెప్పదలచుకొనినది మృదువుగ, ఒప్పుకొనునట్లుగ చెప్పుటకు నేర్పు కావలెను.

మన అభిప్రాయముల నితరు లంగీకరించినను, అంగీకరించకున్నను ఉత్తమ మైనవని భావించి ప్రచారము చేసి, అంగీకరించనివారిని అవహేళన మొనరించి, ఆనందబడుటలో నిరంకుశత్వ మిమిడి యున్నది. ఇక మన చేష్టలవిషయ మాలోచింతము. కష్టపెట్టిన వాని దౌష్ట్యము చిరస్మరణీయముగ నుండును. ఉపకారిని కొంతకాలానికి మరువగలమేమో కాని అపకారిని మాత్రము అహర్నిశము తలచుకొనుచుందుము.

గా:—ఉపకారము, అపకారము జరిగించు టెట్లు?

తం:—ఉపకారమువలన ఇతరులకు సౌఖ్యము, ఆనందము, తృప్తి కలుగును. అపకారమువలవ తద్వ్యతిరేక పరిణామము సంభవించును. మనము కష్టములలోనున్నపు డెవనివలన సహాయము కలుగునో వానిని ఉపకారిగ భావించి కృతజ్ఞత జూపించుదుము. కష్టము లెవని వలన కలుగునో వానిని అపకారిగ గ్రహించి మెలగుదుము. ఉపకారమువలన గాని, అపకారమువలన గాని స్వార్థమునందొక పరిణామము జరుగును. ఆ పరిణామము సుఖవంత మైనపుడు సంతోషము, దుఃఖప్రద మైనపుడు బాధ కలుగును. కాని విజ్ఞానవంతులకు సుఖదుఃఖముల తారతమ్యముతో అక్కర లేనందున అపకారోపకారములు వారికి సమానముగ దోచును. అందువలన వారి కెవరివలన బాధ కాని, సంతోషముకాని కలుగబోదు. అపకారిని శత్రువు



ప్రాణముల దీసికొనుటకై నెంచున్న దూకువానికి సహాయపడి రక్షించుట.

గను, ఉపకారిని మిత్రునిగను సాధారణ మానవులు పరిగణించునట్లు వారు భావించరు. స్వార్థము నశించిన వారే విజ్ఞానులనిపించుకొందురు. చూచితివా! మనో వాక్కాయకర్మలద్వారా మానవు డెట్లు మంచినికాని, చెడ్డనుకాని చేయగలడో! ఎట్టి ప్రవర్తనమువలన ఇతరులకు కష్టనష్టములు కలుగుట కవకాశమున్నదో దానిని దుష్ప్రవర్తన మనియు, ఏ ప్రవర్తనము వలన ఇతరులకు సుఖము, లాభము కలుగగలవో దానిని సత్ప్రవర్తనమనియు భావించబడును. మానవులందఱు సుఖదుఃఖములను సమభావముతో అనుభవించ నేరరు కనుక 'స్వార్థము'తో పనిలేకుండ ఇతరులయెడ మనము మృదువుగ, సరళముగ, విశ్వాస పూరితముగ మెలగ వలెను. నష్ట మొనర్చుట ప్రతివానికి చేతనగును. లాభము కలిగించుట కెంతో శ్రమపడవలసి యుండును. శ్రమకలిగినను, దాని ఫలితమునలన ఇతరులు సుఖ పడ గలిగినచో, ఎందుకు మనము లాభము కలిగించు టకు ప్రయత్నించకూడదు? సత్ప్రవర్తనమువలన ఇత రులకు లాభము కలుగుటయే గాక ఆత్మతృప్తియు సిద్ధించును. ముల్లు గ్రుచ్చుకొని బాధపడు వ్యక్తికి విశ్రాంతి కలిగించుటలో మనమొక విధమగు తృప్తి ననుభవింప గలము. అట్టి తృప్తి ఇతరుల గొంతుకలు కోయువానికి కలుగగలదా?

రా:—సత్ప్రవర్తన మెట్లు అలవడును?

తం:—అధర్మముగ మెలగకూడదను నిశ్చయము కలిగించుకొన వలెను. ఎన్ని కష్టము లెదుర్కొనుటకైనను నిశ్చయము సడలించుకొనరాదు. ధర్మయుత జీవికము గడపువానికి నైతికశక్తి దైనందినాభివృద్ధి జెంది సక్రమ మార్గమును ద్యోతక మొనర్చును. మన ప్రవర్తనము అలవాట్ల ననుసరించి యుండును. అలవాట్లు చెడ్డవైనచో దుర్మార్గుల మగుదుము. అవి మంచివైనచో పురోభివృద్ధిగాముల మగుదుము. మంచి అలవాట్లవలన ఆనందము కలుగును. ఆనందము వలన సౌఖ్యము, సౌఖ్యమువలన తృప్తి, తృప్తి వలన విశ్రాంతి, విశ్రాంతివలన ధ్యానము, ధ్యానమువలన విజ్ఞానము, విజ్ఞానమువలన విచక్షణశక్తి, విచక్షణ శక్తివలన ప్రాపంచికసౌఖ్య వైమనస్యము, తద్ద్వారా స్వేచ్ఛ, విముక్తి కలుగగలవు. వేటకాడైనను విజ్ఞానము కలిగినపిదప జీవహింసను వదలిపెట్టును. పశుపక్ష్యాదులను దయతో, స్నేహభావముతో చూడగలడు. తనది కానిదానిని యజమానికి దెలియకుండ స్వోపయోగార్థము గ్రహించుట దొంగతన మనిపించుకొనును. దాని కలవడినవాడు ధర్మమార్గమున నడువవలెనని నిశ్చయించుకొన్నచో, అవకాశ ముండినను, మునుపటివలె తస్కరింపజాలడు. వ్యభిచారి పరస్త్రీల వంక కన్నెత్తి జూడబోడు. అబద్ధము లాడువాని హృదయము, సత్యప్రియత్వము నలవరచుకొనిన పిదప అనృత మాడుటకు, కొండెములు చెప్పుటకు బాధ

పడును. ఎప్పు డెవరితో ఏవిధముగ ఎంతవఱకు మాట్లాడవలెనో ఎరిగి తదనుగుణముగ మెలగును. "అతి సర్వత్ర విసర్జయేత్" అను సామెత నెల్లప్పుడు మనము స్మరించుచు కాలము నియమిత విధానాను సారము గడుపవలెను. ప్రాణహింస జేయువాని ఆయుఃకాలపరిమితి తరిగిపోవుచుండు నందురు. దొంగి లించిన వాడెన్నటికి శ్రీమంతుడు కాజాలడు. ఎటుల ఐశ్వర్యమువచ్చునో అటులనే మాయమగుచు నుండును. ఇంద్రియసౌఖ్యాలాలసు లొకరితో ఒకరు పోట్లాడుకొను చుందురు. వారి హృదయములందు మాత్సర్య మను తృణము వృద్ధి జెందుచుండును. అబద్ధము లాడువాని నెవరు విశ్వసించరు. తత్ఫలితముగ ప్రజావిరోధి కాక తప్పదు. కొండెములు చెప్పువా డధోగతిపా లగును. వదరుబోతు నెవరు లెక్కజేయరు. త్రాగుబోతునకు పశువునకు తారతమ్య ముండదు. ఏది దూష్యమో దానిని విడిచిపెట్టుము. ఏది ధర్మమో దాని ననుస రించుము. మనోవాక్కాయ కర్మలద్వారా ధర్మము నారాధించుట కొక విషయము ముఖ్యముగ గమ నించ వలెను. మన చేష్టలద్వారా మనకుగాని, ఇతరు లకుగాని ఏ విధమైన అపకారము, అవరోధము కలుగు చున్నదా ? అట్లగుటకు అవకాశమున్నచో ఆ పని నాపవలెను. ఇతరులకు నష్టము కలిగించుట మానవత్వమునకే విరుద్ధము.

రా:—ఇతరుల లోపముల నెరిగి నలుగురికి దెలియబరచుట వలన కలుగు లాభమేమి ?

తం:—దానినే రంధ్రాన్వేషణ మందురు. మానవులలో తప్పు చేయనివా డుండడు. చేసినతప్పు చిన్నది కావచ్చును; పెద్దది కావచ్చును. అమితముగ తేనీటి కలవడుట దూష్యమనుకొందము. అంతకన్న మించిన దురలవాటు మద్యపానము. అటులనే గాయబరచుట తప్పైనను, వధించుటంతటి ఘోరపాపము కాదు. ఈ భేదము పరిణామదశయందు గోచరించును. రెండింటిని జేయనివాడు ఉత్తముడు. ఆగ్రహము నాపుకొనజాలక, దాని నెఱుగజేయుటకై, ఎవడైన నితరులను కొట్టిన తప్పుజేసినట్లే యగును. ఆ తప్పువలన ప్రత్యర్థికి తాత్కాలికముగ బాధ కలుగుననుట సత్యము. కాని ఆగ్రహావేశమున కంఠము నుత్తరించినచో నిండు ప్రాణము పోగొట్టుట యగును. అట్టి తప్పిదము క్షమార్హము కాజాలదు. ఇతరుల దోషముల నన్వేషించి, అభూతకల్పనములతో వానిని ప్రచార మొనర్చుట వలన, సంబంధించిన వ్యక్తులు సంఘగౌరవమును పోగొట్టుకొందురు. కొండెములు చెప్పుటలో ఏమి ఆనందముకలదో వాని కలవడిన వారికే తెలియును. ఇతరులు బాధపడుచుండ, వారిని జూచి ఆనందించుట పిశాచములైన చేయదగనిపని. ఒకరిని గురించి వేరొకనికి దురభిప్రాయము కలిగించుటకు,

ఇద్దరిమధ్య వైరుధ్యము కల్పించి పెంపొందించుటను, తాము మధ్య బాగుపడుటకు కొండెములు చెప్పువారు ప్రయత్నింతురు. కలసిమెలసి ఉండుట కష్టము. కలిసియున్న వారిని విడదీయుట తేలిక. మానవరక్తమును రుచిజూచిన వ్యాఘ్రము దారివెంబడి తలవంచుకొని పోవు పాంథునిపై ఏలబడును? అది దాని సహజ స్వభావము. కడుపునిండ నెత్తురుత్రావి, మాంసము నారగించవచ్చును. అటులనే కొండెములు చెప్పువానికి అమాయకులవలన ధనలాభము కలుగుచుండును. సోమరితనమువలన కష్టపడి సంపాదించుట నిరసించి, ఈ వృత్తికి దిగు దుర్మార్గులనుండి దూరముగ నుండుట శ్రేయస్కరము.

రా:—ఒకరితో నొకరు కలహించుకొనుటకు కారణ మేమి?

తం:—మానవుడు స్వార్థపరుడై అక్రమమార్గ మవలంబించుచున్నాడు. అంతయు తనకే రావలెనను ఆందోళన అతనిలో అనుక్షణము విజృంభించును. పూర్వము సమిష్టి కుటుంబము లుండెడివి. ఎటువంటి దురాలోచనలు, దుశ్చేష్టలు లేకుండ అందరు శాంతముగ జీవిత కాలము గడపుచుండెడివారు. పరస్పర విశ్వాసము, ఆదరము, అనురాగముపై వారి సంబంధము లాధారపడి యుండెడివి. ఈనాడు సమిష్టి కుటుంబమన నేమో చాలమందికి తెలియదు. ఎవనికివాడు స్వార్థపరుడై న్యాయమైనను, అన్యాయమైనను తనకే సర్వము చెంద

వలెనని ఆశించి ఆందోళన జరుపుచున్నాడు. ఐశ్వర్యవంతుడనను భావము ప్రబలమైనకొలది మానవునిలో దురాశ, దౌర్జన్యము హెచ్చగుచుండును. ఐశ్వర్యము వ్యక్తిగతముగ సౌఖ్యదాయకముగ నుండవచ్చునేమో కాని పరులను పీడించుట కుపయోగించ కూడదు. ఉదాహరణమున కొక గ్రామములో నున్న ధనవంతుడు సాధారణముగ అందరి అందుబాటులో లేని ఒక వస్తువును పూర్తిగ తానే కొనినచో, అవసరము వచ్చినపుడు తక్కిన ప్రజలు ఆ వస్తువు దొరకక బాధపడుట తటస్థించును. అన్యాయ మొనర్చుటకు వెనుకంజ వేయని కఠినాత్ములవలననే కలహములు కలుగుచుండును. స్వార్థమునకు విఘాతము కలిగినచో మానవు డాగ్రహించును. ఆగ్రహావేశమున పశుత్వము నాపాదించుకొని, పశువుకన్న హీనముగ బ్రవర్తించును. గడ్డిమేయు పశువుదగ్గర కింకొక పశువు వచ్చినచో ఆ రెండింటికి పోట్లాట ప్రారంభమగును. పశువులలో విచక్షణశక్తి లేదు. కాని మానవుని కది సృష్టి సహజము. దానిని మరచి ప్రవర్తించుట నేడు జరుగుచున్నది. పైపెచ్చు అదియే నాగరికతయని వ్యవహరింప బడుచున్నది. చెప్పున దొకటి, చేయున దొకటి పెద్దమనిషి లక్షణమైనది.

"ర:—క్రోధము వలన కలుగు నష్టము లెట్టివిగా నుండును ?

తం:—హృదయశాంతితో జీవించవలెనన్న కోపము కూడదు. కోపములో మన మనేకములగు దుశ్చేష్టలకు పాల్పడు చుందుము. ఇష్టము కానిపని చేసినవారిపై మనకు కోపము కలుగును. మనకు ఇష్టము కానిరీతి నడిచె నను భావము కలుగుటయే క్రోధమునకు కారణము. ఎవని ఇష్టము వానిదను భావము మనకు కలుగబోదు. స్వార్థాభిలాషతో మన ప్రవర్తనమువలన ఇతరులకు కష్టనష్టములు దాపురించినను మనము విచారించ బోము. క్రోధ మనేక అరిష్టములకు దారితీయును. ఒక ఉదాహరణము చెప్పెదను వినుము. ఒకడు భగ వంతుని ధ్యానించుచుండెను. ధ్యానని మగ్నుడై రోజు రోజుకు ఎక్కువసేపు ఎవరితో మాట్లాడకుండ లక్ష్మి కృత మనస్కుడగుటకు యీవచ్చుకైని వినియోగింప దలచి మెలగుచుండెను. వాతావరణము ప్రశాంతి ముగ నుండుటకై దొడ్డిలో ఒక పూరిపాక వేయించు కొని అందులో భగవద్ధ్యాన మొనరించుచుండెను. ఒకనా డతని కుమారుడు బాల్యచాపల్యముచే అల్లరి చేయుచు ఆ ప్రాంతమున దిరుగాడ జొచ్చెను. అతని దృష్టి చలింపదొడగెను. ఎంతసేపటికి పిల్లవాడూరు కొననందున పట్టరాని కోపముతో వాని కాళ్లనుబట్టి పైకెత్తి గిరగిరద్రిప్పి నేలపై బడగొట్టెను. పాప మా పాపడు ఆ దెబ్బకు తట్టుకొనలేక చనిపోయెను. పిల్ల వానిని నేలపై బడగొట్టిన మరుక్షణమే తండ్రికి తాను జేసిన ఘోరకృత్యము తెలియవచ్చెను. పుత్రి

9)



కోపము చే కన్నకుమారుని గెంటుతున్న మానవుడు.

ప్రేమ ఉబికిపోయెను. కాని ఏమిలాభము ? పిల్లవాడు మరణించెను. క్రోధమువలన ఎట్టి అపకారము గలుగ గలదో దెలిసికొనజాలెనే కాని మరణించిన పుత్రుని బ్రతికించుకొన గలడు ? ఏ చిన్న విషయమునకైనను మనకు పట్టరాని క్రోధము కలుగును. "నా" అను భావము ప్రబలముగ నున్నవానికి క్రోధము హెచ్చుగ నుండును. 'నా' అను భావనమే స్వార్థము. స్వార్థము వేరుపురుగు వంటిది. అహర్నిశము మానవుని బుద్ధిని పెడదారి బట్టించును. అనుకొనిన పని పూర్తి యగు నంతవఱకు ఆరాట పెట్టుచుండును. కోపము మహాత్ము లనుసైతము తప్పుడు త్రోవల బట్టించును. విశ్వామిత్రుడు, దుర్వాసుడు మొదలగు మునుల జీవిత విశేషములు మనకు ప్రబల తార్కాణములు. కనుక శాంతస్వభావ మలవరచుకొనుట జీవిత లక్ష్యములలో ప్రధాన మైనదిగ నుండవలెను.

రా:—ఆ నాడు ప్రచారములోనున్న విధానము గాకుండ గౌతముడు క్రొత్తవిధాన మేదైన మానవ ముక్తి కొఱకు బోధించెనా ?

తం:—క్రొత్తవిధానమును స్వానుభవముతో గనిపెట్టి మానవ జాత్యుద్ధరణకై బోధించెను. ఆనాడు బ్రాహ్మణులు భోగానుభవమునకు దారి చూపునట్టి కార్యముల నాచ రించుచుండిరి. యజ్ఞము జేసినవానికి రంభాసంభోగము సంభవ మగుననియు నచ్చజెప్పుచుండిరి. పైపెచ్చు

తపోనిష్ఠపేరుతో ఆత్మబాధ కలిగించు కార్యముల నుపదేశించుచుండిరి. ఈ రెండు మార్గములు గౌత ముడు త్యాజ్యములని గుర్తెఱింగి మధ్యమార్గ మొక దానిని బోధించెను. ఆమార్గ మష్టవిధము. సదభి ప్రాయము, సదాలోచనము, సత్సంభాషణము, సద్వ ర్తనము, సజ్జీవనము, సత్ప్రయత్నము, సన్మనస్కృత, సన్మననము. ధర్మమును మరువకుండ, దౌర్జన్యము విడిచిపెట్టి, ఇంద్రియములకు లోనుగాక, ఉత్తరగతు లను నిర్ణయించునదగుటచే సత్కర్మకు బద్ధుడై మాన వుడు మెలగవలెను. ప్రాణికోటియెడ దయాస్వభా వము బ్రదర్శించుట మంచిది. అందులకై అప్రియ త్వము, ఆశ, ఆగ్రహము వదలిపెట్టవలెను. జీవితము మందమలయమారుతమువలె సరళముగ, సుఖవంత ముగ గడుపవలెను. అద నెరిగి, ఆదరముతో, అవసర మున్నంత వఱకు మాత్రమే సంభాషించవలెను. ఇత రుల హృదయములలో శాంతిని, సౌహార్ద్రతను, సాను భూతిని కల్గించు సంభాషణము ఉత్తమమైనది. అప కారము నరికట్టి, ఉపకారము నందజేయుటకై ప్రతి వ్యక్తి నిరంతరకృషి సలుపవలెను. ప్రతి పని ప్రేమ పూరితముగ నుండవలెను. ఈ విధముగ సాధారణ మానవులు ప్రయత్న ఫలితముగ మెలగగలరు. రెక్కలుగాని పక్షులు ఎత్తున కెగిరినచో అపాయము సంభవించును. రెక్కలు గట్టిపడినపక్షు లెంతఎత్తున కైన ఎగురగలవు. పటుత్వము, పట్టుదల, సామర్థ్యము

గల వ్యక్తులు ముందంజ వేయగలరు. వారు ముక్తి కొఱకు పాటుపడవలెను. భార్యాపుత్రుల ప్రేమ వలన మానవుడు ప్రాపంచిక విషయములనుండి విముఖుడు కాజాలడు. జీవిత మశాశ్వతమైనను, అంతవఱకు అనుభవించిన సౌఖ్యములను విడనాడుట కష్టమైనపని. అనుభవించుచున్న సౌఖ్యములు లభించవేమో నను భయముతో వానిని గల్గించుకొనుటకు ప్రతి మానవుడు ప్రయత్నించును. ఐనను, మానవుడు పశువువలె మెలగరాదుకదా! మెలగుచున్నను పశువుతో పోల్చినచో అతనికి కోపము వచ్చును. సంసారి ధర్మములను నిర్వర్తించుచు, ఉత్తమాశయములతో సక్రమ మార్గమున నడచుటకు ప్రయత్నించుట లాభదాయకమే గాని నష్టదాయకము కాజాలదు. ఏ పని యైనను స్థిరసంకల్పముతో విజయవంత మొనర్పవచ్చును. స్థిరసంకల్పము గలవానికి సందేహము లుండవు. అస్పష్టత నశించును. ఆశ లడుగంటును. ప్రాపంచిక సంబంధములు సడలిపోవును. మనోనేత్రము వికసించి అంతర్వాణి వినబడును. ఆ తరువాత "ఆత్మవత్సర్వ భూతాని" అను విజ్ఞాన మలవడి విశ్వాంతర్యామి చిద్రూపమును సర్వత్ర సందర్శించ గలుగును. ఎట్టి పరిస్థితులందైనను స్థితప్రజ్ఞుడై మెలగును. ఆస్థితికి రాగలిగిన వానికి జీవిత సౌఖ్యములందు, స్వర్గసౌఖ్యములందు, దూషణ భూషణలందు, అభిరుచి లేకుండ పోవును. ఏది కోరకపోయినను, సర్వ మతనికి లభిం

చును. స్వార్థము నశించి విశ్వాము నంతటిని తనదిగ జేసికొనజాలును. ఏ ప్రాణికి, అదెంత స్వల్పమైన దైనను, బాధకలిగించుట దోషము. ఉన్నదాని నితరులకు దానము జేయుము. ఇతరులు మనఃపూర్వకముగ నొసగుదానిని అవసర మున్నంతవఱకుమాత్ర మంగీకరించుము. తప్పుడు సాక్ష్యము లిచ్చుట, అనృత మాడుట, పరదూషణకు బాల్పడుట వదలిపెట్టుము. అంతఃకరణము పవిత్రముగ నుంచుకొనుము. సత్యసంధుని అంతఃకరణము పవిత్ర ముండునని ఎరిగి ప్రవర్తించుము. సోమపానము విధిగ జరుపవలసిన యజ్ఞయాగములను పరిత్యజించుము. సన్మనస్కునికి, సచ్ఛీలునికి సోమపానముతో పనిలేదు. పరస్త్రీల నాశించకుము. ధర్మవిరుద్ధముగ నుండునట్లు శారీరకముగ, మానసికముగ ఏపని చేయకుము.

నా:—గౌతముడు బోధించిన మార్గ మనుసరించుటకు గురుసహాయ మక్కఱలేదా? గురూపదేశమునం దెంత మాహాత్మ్యము కలదని నలుగురు చెప్పుచుందురుకదా!

తం:—గౌతముని సిద్ధాంతానుసారము ప్రతి మానవుడు స్వయంకృషిపై ఆధారపడి విజ్ఞానము నార్జించుకొనగలడు. మత గురువులపై, వేదాంత గ్రంథములపై ఆధారపడ నక్కఱలేదు. ఏవో కొన్ని ఆచారముల ననుసరించుటవలన గాని, మూఢ నమ్మకములతో జీవహింస నవసరమగు దేవతారాధన క్రియము వలన

గాని ముక్తి లభించదు. సచ్ఛీల మలవరచుకొని, ధర్మనియతితో, భూతదయ కలిగి జీవితము గడుపు వానికి విముక్తి లభ్యమగును.

రా:—గౌతముడు సత్యమును గురించి ఎరిగించిన దేమి ?

తం:—జీవులు బాధపడుట సత్యము. ఆబాధ కొక కారణ మున్నది. దానిని నివారించుకొను మార్గము కలదు. అన్ని వస్తువులు అశాశ్వతములు కనుక బాధ కలుగును. జీవితము పుట్టుట గిట్టుట అను సంఘటనలపై ఆధారపడి యున్నది. పుట్టిన నాటినుండి గిట్టు వరకు జరుగు కాలమే జీవితము. యావత్సృష్టి పరిణామదశ కలిగి యుండును. ఆ పరిణామ మనంతరము ఎల్లప్పుడు సాగుచునే యుండును. నిప్పును గురించి, దాని వలన కలుగు లాభ నష్టములను గురించి బుద్ధుడు బోధించ లేదు. నిప్పులోబడి దగ్ధమగుచున్న వారిని బైటికి దేగలమార్గ మన్వేషించి బోధించినాడు. అన్నాతురు నికి ఆహార నియమములతో, మంచి చెడ్డలతో ఏమి పని ? వానికి కావలసినది క్షుద్బాధ దీర్చుకొనుట.

రా:—పరిణామ మనంత మనిన నేమి అర్థము ?

తం:—నామ రూపములద్వారా మనము వ్యక్తులను గుర్తింప గలము. ప్రతి వ్యక్తికి వేదన, సంజ్ఞ, సంస్కారము, విజ్ఞానము కలవు. ఆత్మనుబట్టి పునర్జన్మ కలదను భావము ప్రబలమైనది. క్రొత్తగ బుట్టిన శిశువు, చనిపోయిన

వృద్ధునిగ పరిగణించము. ఐనను ఆ వృద్ధుడే శిశువుగ మరల జన్మించె ననుట సత్యము. పూర్తిగ భేదాభిప్రాయమును గాని, ఏకాభిప్రాయముగాని వెలిబుచ్చుట సాహసము. ఒక అనుభవము వేఱొక అనుభవమునకు దారితీయును. లేదా కలిగించును. లేదా అందులో లీనమగును. అన్నిటి కూడికయే జీవితము. 'నా' అను భావము నశింప జేయుటయే జీవిత పరమావధి. ఆ లక్ష్యసాధన కుపయుక్తములగు మార్గము లన్నియు సక్రమమైనవే. వెనుక జెప్పినట్లు బుద్ధు డెనిమిది మార్గముల నుపదేశించెను. బుద్ధుని కాలములో వర్ణ వ్యవస్థ దోషభూయిష్టముగ నుండెడిది. పుట్టుకతో బ్రాహ్మణునికి ఎక్కడలేని గౌరవ మర్యాద లొసగ వలెననుట బుద్ధుడు తీవ్రముగ నిరసించెను. ఆచరణ వలన గౌరవము కలుగునని అతని వాదము. ఐతే, బుద్ధుడు సంఘసంస్కారమునకు బూనుకొనలేదు. మత సంబంధమైన విషయముల కెక్కువ ప్రాముఖ్యత నొసగెను. బుద్ధుడు కనిపెట్టి ఉపదేశించిన అష్టవిధ మార్గము సాధారణ మానవులకు అందుబాటులో నున్నట్లు కన్పడినను అది విద్యాసంస్కారపరులకు మాత్రమే ఆచరణయోగ్యముగ నుండెను. 'నిర్వాణ' మన నేమి ? మానవుని హృదయమునందు చెలరేగు విషయ వాంఛానలమును, మాత్సర్యమును, అజ్ఞానమును తుడిచివేయుటయే బుద్ధుని స్థిరసంకల్పము. జీవితము నమ్మకముతో, శాంతితో, సరళతతో, సంతో

షముతో, పవిత్రవంతముగ గడుపగలిగి నిర్విచార ముగ మరణించుటయే నిర్వాణము. బుద్ధుడు విజ్ఞాన మునకు, దాని నాధారముగ జేసికొని జరుపబడు ఆధ్యాత్మిక వాదోపవాదములకు ప్రాధాన్యత నొసగ లేదు. తర్కములవలన మానవుడు తరింపజాలడని అతని మతము. కాకి గోలచేయకుండ కనులు మూసి కొని కష్టపడి సాధింపగలిగిన అనిర్వాచ్యానందము ననుభవించుటయే అతని అభిమతము. ఆ విషయమునే ఇతరులకు బోధించెను. నీతిమార్గమును విడిచి, మత సిద్ధాంతములను పట్టుకొని ప్రాకులాడువారికి మోక్షము లభింపదనియు, పవిత్రజీవనముతో నారంభమై "ఆత్మ వత్సర్వ భూతాని" అను పరమార్థమున కనుగుణముగ భూతదయతో మెలగువారికి మోక్షము కలుగుననియు బుద్ధు డుపదేశించెను.

గా:—బౌద్ధమత సూత్రము లెట్టివి ? వానికి విస్తృతమైన ప్రచార మేల కలిగెను ?

తం:—బుద్ధుని ఉపదేశానుసారము యావద్విశ్వము నిరంతర పరిణామదశకు లోనై, పూర్ణత్వము జెందుటకై, జరిగి పోవుచున్నది. ఏదియు స్థిరముగ నుండజాలదు. శాశ్వ తము కాకున్నను, మానవజాతి స్థిరముగ నుండదల చుట పొరపాటు. అశాశ్వత మైనదానిగురించి విల పించుట అజ్ఞానము. ఈ అజ్ఞానముతో మానవులు దుఃఖావస్థ ననుభవించు చున్నారు. అ జ్ఞా న ము

పోగొట్టుకొనుట వారిచేతిలోని పని. ఐతే, దృఢ సంకల్పము కలిగిననే గాని ఏ ప్రయత్నమైనను ఫలించదు. విచారము [illegible]ముజేయు మార్గమేది? దానిని గురించి చర్చించుచు బుద్ధుడు "విచారము కలదు, దాని కొక కారణము కలదు. దానిని నివారణమొనర్చు మార్గము కలదు. విచారము నివారము కాగలదు. పుట్టుక, పెరుగుదల, వృద్ధత, మృత్యువు, అప్రియ సహవాసము, స్నేహపరిత్యాగము, అలభ్య కామ్యాసక్తి దుఃఖదాయకములుగ నుండును. కోరిక వలన దుఃఖము కలుగును. మోహ మాత్సర్యము లణగంటిన నాడు దుఃఖము మాయమగును. ఇంద్రియములను స్వాధీనపరచుకొని, భూతదయ గలిగి, మనోవాక్కాయ కర్మల ద్వారా ధర్మమార్గము, ననుసరించువానికి దుఃఖము కలుగ బోదు. మనసును, ఇంద్రియములను, బుద్ధిని స్వాధీనపరచుకొనుట కన్న మించిన విజ్ఞానము మరొ



"మానవ సేవయే మాధవ సేవ"

కటి లేదు. భూతదయకన్న మించిన తపము లేదు. దుఃఖ పీడితుల సేవకన్న మించిన పుణ్యకార్యము లేదు.

అదివరకే విరివిగ ప్రచారమునందున్న నమ్మకములు ఆత్మ, పరమాత్మ, స్వర్గము, నరకమునకు సంబంధించిన వానిని బుద్ధుడు ఖండించలేదు. కాని అత్యాశకన్న మించిన నరకము, భూతదయా పరమైన హృదయానందమునకన్న మించిన స్వర్గము, స్వార్థ చింతనముకన్న మించిన పాపము, ఇతరుల కుపకరించునటుల గడుపబడు జీవితవిధానముకన్న మించిన గొప్పదనము, ఇతరుల ఆనందములో స్వాత్మానందము ననుభవించుటకన్న మించిన సుఖము లేవని స్పష్టముగ దెలియబరచెను.

బుద్ధునిజీవితము భూతదయతో నిండినది. "మానవ సేవయే మాధవసేవ" అను నేటి నినాదమును 2000 సంవత్సరములక్రితమే బుద్ధుడు ప్రచార మొనర్చినాడు. డార్విను మహాశయుని సిద్ధాంతము నేనాడో కనిపెట్ట గలిగినాడు. కష్టపడి పనిజేయుట గౌరవహాని కాదని చాటెను. అంటరాని తనము నిర్మూలించవలెనని ఆదేశించెను. స్త్రీ స్వాతంత్ర్య మపేక్షణీయమని వ్యాఖ్యానించెను.

రా:—"ఆత్మవత్సర్వ భూతాని" అనిన నేమి ?

తం:—సర్వభూతము లందలి ఆత్మలన్నియు నొకటేయని చెప్పకొందము. లేదా సర్వభూతములం దొకటే ఆత్మ ప్రకాశించుచుండు నని యైన గ్రహించ వచ్చును.

గా:—ప్రాణికోటి అనంతమైనప్పుడు, వానిలో ప్రకాశించు ఆత్మమాత్ర మొకటి యెట్లు కాగలదు ?

తెం:—ప్రాణికోటి అనంతమైనదనుట సత్యమే. అపారపారావారము అఖండాకృతితో దృగ్గోచర మగుచున్నను, ఆ అఖండాకృతి విభిన్నరీతులు కలిగియుండును. ఎన్నడు చూడనివానికి సముద్రము వెఱపు గొలుపును. మఱో కని కది చూచుటకేగాక, తనివిదీర స్నానమాడి అలలతో ఆడుకొనుటకుకూడ ఆ న ం ద నిధానముగ దోచును. ప్రాణికోటి అనంతమైనదనుట సంఖ్యావిశేషము ననుసరించి యుండును. శరీర నిర్మాణము, రూపము విషయమై ప్రాణులలో వ్యత్యాసము సృష్టి సహజముగ నేర్పడినది. కనుకనే మనము ప్రాణులను వివిధజాతులక్రింద వ్యవహరించుచున్నాము. మానవజాతి, మృగజాతి, పక్షిజాతి మొదలగు విభాగములను గావించితిమి. ఈ జాతులలో తరతమభేదములను కల్పించి వృద్ధిజేసితిమి. ప్రాణులన్నిటిలో మానవజాతి గొప్పది అని మానవులగు మనము నిర్ణయము జేసికొంటిమి. మనలో మనము గొప్పతనము నిరూపించుకొన దలచుదుము. ఇక తక్కిన ప్రాణులతో మన కేమి అవసరముకలదు ? మన అక్కరలకొరకు ఎదుగాకని ప్రాణుల నుపయోగించుకొని జీవించుట మనకు తప్పనిసరి యైనది. గుఱ్ఱపుబండివాడు ఎక్కువ కూలి కిట్టుటకై చేతకాని బక్కచిక్కిన గుఱ్ఱమును పరు

ముగ గనిపించుటకై వెలుతురు అవసరము. అందు
కను దీపము వెలిగింతుము. దీపపు కాంతివలన చీకటి
తొలగిపోవును. అట్లులనే అంధకార బంధురమైన దేహ
మును ప్రకాశవంత మొనరించునది ఆత్మ. ఆత్మ
జ్యోతి వంటిది. దీప మారినచో చీకటిగ నుండును.
ఆత్మ లేనిచో దేహము నిరుపయోగ మగును. ఉప
యోగము లేని పాడుగదిలో వెలుతురు లేకుండ ఎవడు
ప్రవేశించును? పనికిరాని గదిని వదలి పెట్టుదుము.
ఆత్మ లేని దేహమును వదలిపెట్టుదుము. దేహము
పనికిరాకపోవుటనే మృత్యు వని చెప్పుదురు.

శా:—ఆత్మ యనిన, ప్రాణమనిన ఒకటేనా?

తెం:—కాదు, సూక్ష్మవిభేదము పాటింపవలసి యుండును.
దీపము వలన వెలుతురు వచ్చును. దీపము లేక వెలు
తురు లేదు. కాని రెండు ఒకటే యనగలమా? ఆత్మ
దీపము వంటిది. ప్రాణము వెలుతురు వంటిది. వెలు
తురు వంటి పెట్టుకొనియుండు నీడవలె, ప్రాణము వంటి
పెట్టుకొని మృత్యు వుండును. నీడను జూచి భయ
పడుట భీరుని లక్షణము. జ్ఞానులు మృత్యువును జూచి
భయపడరు. ప్రాణమునకు తార్కాణము చలనము.
చలించునవి ప్రాణులు. ప్రాణములేని పాషాణములు
చలన రహితములు. చలించుట ప్రాణమునకు తార్కాణ
మగుచో, ప్రాణము ఆత్మయొక్క ఉనికికి తార్కాణ
మగుచో, ఇక సర్వభూతములు సమాన లక్షణములు
కలిగియుండుటలో ఆశ్చర్య మేమి కలదు? లక్షణ

ములు దైహికములు కావు సుమా! ఈ సత్యము నెఱిగి ఆచరించు విజ్ఞానుల ప్రవచనమే "ఆత్మవత్సర్వ భూతాని" అనునది.

రా:—బాధ ననుభవించునది దేహమా, ఆత్మయా?

తం:—బాధ రెండు విధములు: మానసికము, శారీరకము. శారీరకమగు బాధ మనసు నంతగ కలవర పరచదు. మానసికమగు బాధ శరీరమును గాయపరచదు. ఐనను, బాధానుభూతి జీవికి తప్పనిసరి యగును. ఏ విధమైన దైనను, బాధ ననుభవించనిది దేహము. ఆత్మకు బాధానుభవ ముండదు. అశాశ్వతమైన దేహమున కెచట గాయము తగిలినను, అది మానిపోవునంత వఱకు బాధ కలుగుచుండును. బాధ నెత్తుటినుండి జనించును. మృతశరీరములో నీరుతప్ప రక్తముండదు. వెచ్చగ నుండునంతవఱకు రక్తము ప్రవహించును. వెచ్చదన ముడిగినచో గడ్డకట్టును, లేదా నీరయి పోవును. గడ్డకట్టుట ప్రాణముపోని పక్షమున జరుగును. దేహమునకు తగులు గాయములు ఆత్మకు తాకవు. ఆత్మ నిత్యము. మార్పులేనిది. దేహము అనిత్యము. వృద్ధి క్షయములు కలది. ఆ కారణము వలన దేహము నశించును. మార్పు వృద్ధికే గాక, క్షయమునకు గూడ త్రోవ దీయును. అటులనే జనన మరణములకు కారణభూత మగుచున్నది.

రా:—నెత్తురు వెచ్చగ నుండకపోయిన మృతశరీర మెట్లగును ?

తం:—దీపము వలన వెలుతురు వచ్చును గదా ? ఆ వెలుతురు వెచ్చగ నుండును. అది దాని గుణము. నిప్పు సెగ వెచ్చగ నుండక చల్లగ నుండునా ? అదే విధముగ ప్రాణము నిలచుటకు తార్కాణము వెచ్చని నెత్తురు ప్రవహించుట యగును.

రా:—బాధవలెనే, మానావమానములు దేహమునకే ఆపాదించును గదా ! అవమానమునకు మానవు డేల బాధపడును ? అనిత్యమైన దేహమునకు కలుగు బాధ నెందుకు లెక్క జేయవలెను ? ఆత్మకు బాధానుభూతి లేదనుకొనినంత మాత్రాన, దేహబాధను మరచిపో గలమా ?

తం:—అవమానమువలన గలుగు బాధ మానసిక మైనది. కన్ను, ముక్కు, చెవి, చేతులు, కాళ్లు మొదలగు అవయవములవంటిది కాదు మనసు. అది అనుభూతికి నిలయము. గాయము తగులునది దేహమునకు. నెత్తురు కారునది దేహమునుండి. బాధగ నున్నదను అనుభూతిని కలిగించునది మనసు. దానిని హృదయ మనియు జెప్పవచ్చును. అభిమానము దెబ్బతినుటనే అవమానమని ఎఱుగుము. 'నా' అను అభిమానము నశించని వానికి అవమాన మనుభావ్య మగును.

దూషణ భూషణ లతనికి దుఃఖమును, ఆనందమును కలిగించును. "నన్ను దూషించితివా?" అను భావము ప్రబలముగ నున్నంతవఱకు మానవుడు అవమానింప బడితినని అలమటించును. లేదా 'నన్ను భూషించిరి' అను భావము నభివ్యక్తి జేసికొని ఆనందము ననుభవించును. ఇవి రెండు మానసిక పరిణామములే యగును. ఆత్మకు బాధానుభూతి లేదు. ఆ విషయము గ్రహించి, నియమ బద్ధముగ ప్రవర్తించు వాని కెట్టి బాధానుభూతితో ప్రసక్తి యుండదు. తపోనిమగ్నుడగు వానిని తేలుకుట్టినను బాధానుభూతి వ్యర్థ మగును.

రా:—ఆత్మ నిత్యమైనప్పుడు, దాని నెవరు హత్య గావింప గలరు? లేనిచో ఆత్మహత్యకు అర్థమేమి?

తం:—ఆత్మ నిత్యమైనదే. ఆ విషయమై సందేహ మక్కఱ లేదు. బలవన్మరణము బాధాకరము. మృత్యువు వలన దేహబాధ అంతవఱకున్నది అంతమగును.నిండు ప్రాణములను దీయుటయే హత్య యనబడును.మృత్యు వనేక రూపములతో రావచ్చును. ఆకస్మిక మరణ మునకన్న బలవన్మరణము ఘోరమైనది. ఒకడు ముందు జరుగబోవున దెఱుగకుండ ఏ రైలుక్రిందనో, మోటారుకారుక్రిందనో లేక మఱొక ఆకస్మిక సంఘ టనవలన మరణించె ననుకొనుము. భావి నెరుగని కతాన అట్టి నిర్భాగ్యునికి కలుగు బాధకన్న చేజేత

ప్రాణములను పోగొట్టుకొను పాపికి కలుగుబాధ
ఎక్కువగ నుండును. దేహబాధయే గాక మానసికా
వేదనయు నట్టివా డనుభవించును. బ్రతుకుపై అస
హ్యము కలుగ జేసికొని, ఎదుర్కొను క్లిష్టపరిస్థితులను
సవరించుకొన లేక, చనిపోయినచో విముక్తి లభ్య
మగునను భ్రమతో బలవంతముగ ప్రాణములను దీసి
కొనువా డెంతయో మానసికావేదనకు గురియగును.
ఇంతకుముందు జెప్పినట్లు, ప్రాణములపై తీపి ప్రతి
జీవికి ప్రబలముగ నుండును. అది సహజము. బ్రతు
కుటకు బదులు ప్రాణములను బోగొట్టుకొన నెంచువా
డట్టి పనికి సంతోషముగ బూనుకొనునని భావింప
గలమా? ఇతరులచే గాక, చేజేత ప్రాణములను దీసి
కొనుటనే మనము ఆత్మహత్య యని వ్యవహరించు
చుందుము. ఏ కారణముననైనను, ఏ మార్గమున
నైనను, మృత్యుపరిణామమునందు మార్పు కలుగ
బోదు. మృత్యువు దేహమునకే గాని, ఆత్మకు కాదు.
ఆత్మహత్య యనిన స్వయముగ తనకు దా హత్య
గావించుకొనుట. ఆత్మోన్నతికి బాటుపడుట తప్పదు.
మన మొనర్చు కర్మల ఫలితమునుబట్టి పునర్జన్మలు
ప్రాప్తించును. జన్మరాహిత్యము మానవుని జీవిత
పరమావధి. అది సాధ్యముకానిచో జన్మ లెత్తవలసి
యుండును. ఎన్ని జన్మలకైనను జీవి పుణ్యరాశియై
వెలుగొందగల డేమోనని ఈశ్వరుడు అనేక అవకాశ
ములను బ్రసాదించును. ఆ అవకాశములనే జన్మలని

ఎఱుగవలెను. ఇవ్వబడిన అవకాశములను దుర్విని యోగ పరచుకొనువా డధోగతి జెందును. సద్విని యోగ మొనర్చుకొని విజయము సాధించు జీవికి ముక్తి కలుగును.

రా:—ముక్తి యన నేమి?

తం:—జనన మరణములనుండి విముక్తియని అర్థము. ముక్తి పొందునది ఆత్మకాని దేహముకాదు. దేహము జీర్ణ వస్త్రముతో బోల్చబడినది. మనము జీర్ణవస్త్రమును వదలి నూత్న వస్త్రమును ధరించునట్లే, ఆత్మ ఒక దేహమును వదలి వేఱొక దేహమున బ్రవేశించును. ఒక దేహమును వదలుట మరణముగను, వేఱొక దేహమున బ్రవేశించుట జననముగను భావింతురు. ఈ ప్రవేశ నిష్క్రమణములనుండి శాశ్వతముగ తప్పి కొనుట ముక్తి యనబడుచున్నది. జనన మరణములు ప్రతిజీవికి ప్రాప్తించును. తారతమ్యము లేదు. జీవుల మధ్యఉన్న తారతమ్యము దైహికము. అంత మాత్రమున అల్ప జీవులను నాశనమొనర్చుట తగదు. అల్పజీవులను దయాదృష్టితో జూచుట మానవుని నైతిక ధర్మలక్షణము.

రా:—జీవిత మశాశ్వత మైనపుడు, మానవుడు స్వాతంత్ర్యము నేల కాంక్షించును?

ఇతరుల ఆధీనములో లేకుండుట స్వాతంత్ర్య మన బడును. అనగా ఎవని యిష్టమునచ్చినట్లు వాడు మెల గుటయుని నిర్వచించుకొన నచ్చును. అట్లు మెలగుట నియమబద్ధముగ నుండనిచో వినాశన హేతువు కా గలదు. నియమబద్ధముకాని జీవితము దారము తెగిన గాలిపటము నంటిది. పుట్టిన ప్రతిజీవి వృద్ధిక్షయము లకు లోబడి మృత్యువాత బడునంతవఱకు స్వరక్షణాకై పాటుబడుచు బ్రతుకు చుండును. రక్షణాలేని జీవితము క్షణభంగుర మైనది. పిల్ల చేపలు, రక్షించుకొను శక్తిలేనివి కనుక, పెద్ద చేపలు మ్రింగి కడుపు నింపు కొనును. ఈని ఆకలితో అలమటించు పెద్దపులి తన బిడ్డలనే భక్షించును. రక్షణ యనిన ఎదుర్కొనుట యే కాక తప్పించుకొనుట యని ఎఱుగవలెను. పెద్దపులి బారినుండి తప్పించుకొని కనబడకుండ దాగుకొను చిన్న జంతువులు తమకు తాము రక్షించుకొను చున్నవి. ఎదుర్కొని నిలచుటకన్న తప్పించుకొని పారిపోవుట సులభము.

మానవుడు పంచేంద్రియముల బారినుండి అను క్షణము రక్షణ గావించుకొనవలెను. అనగా వాని అధీనములో నుండకూడదు. అధీనములో నున్నవానికి అధోగతి ప్రాప్తించును. పరాధీనతను మించిన చేటు వేఱొకటి లేదు. మానవుడు తోటి మానవులనుజూచి భయపడ నవసరములేదు. తనలోని బలహీనతను జూచి వెఱచి అంత మొనరింపవలెను. ఆ బలహీనత

ఎట్టిది? బుద్ధి పుట్టినదే తడవుగ విచక్షణలేకుండ ప్రవర్తించుటవలన మానవుడు బలహీనతను తనకు దానాపాదించుకొనుచున్నాడు. బుద్ధి కతీతమైనవిషయము నవగాహన మొనర్చుకొనుట కహర్నిశము పాటుపడుచున్నాడు. విజయము సాధించితినను భ్రమకు లోనయి, గ్రహించుకొనిన దానిని మించినదిక లేదను అజ్ఞానము గల్పించుకొని, స్వతంత్రుడ నని భావించుచున్నాడు. ఈనాడు వాక్స్వాతంత్ర్యము, భావ స్వాతంత్ర్యము, కార్య స్వాతంత్ర్యము మొదలగు నినాదములు నల్దిక్కుల మార్మ్రోగుచున్నవి. చెప్పదలచుకొనినది నిర్భయముగ చెప్పుట, ఇష్టము వచ్చినట్లు మేధాశక్తి ఉన్నంతవఱకు వినియోగించుకొనుట, తలచినరీతి మెలగుట స్వాతంత్ర్యమునకు ప్రధాన లక్షణములుగ పేర్కొనబడుచున్నవి. కాని అట్టి స్వాతంత్ర్యమే నాటికి శ్రుతిమించి రాగాన పడకూడదు. ఐతే, బుద్ధిబలముచే, సారాసారవివేకము నార్జించి, సక్రమ మార్గమున మెలగుట ప్రతి మానవునికి తప్పనిసరి యగును. విన్నదానిని ఆచరించుట ప్రమాదకరము. ఇతరు లాచరించుచున్నారను భావముతో ఏ సాంప్రదాయమును గాని, ఆచారమునుగాని పాటించుట శ్రేయస్కరము గాదు. మంచిదే కావచ్చునని పూర్వాపరము లాలోచించకుండ ఇతరుల సలహా ననుసరించుట తొందరపా టనిపించుకొనును. పరుగెత్తుచు పాలు ద్రాగిన దానికన్న, నిల్చొని నీరు

త్రాగుట మేలని ఎరుగుము. పరుగెత్తెడివాని చేతిలో పాలెట్లు నిలుచును? పాలు దొర్లిపోవుచున్న నిక నాతడు త్రాగునదేమి?

అటులనే తొందరపడి చేయు ప్రతి పని నిష్ఫలము కాక తప్పదు. తొందర పాటున మంచి చేయబోయి చెడు చేయవచ్చును. తలచిన దొకటి, జరుగున దొకటియు నగును. గ్రంథముల నాధారముగ దీసికొని, మంచిచెడ్డల నరయక, ఏ పనియు జేయరాదు. బంగారము జేయు విధానమును గ్రంథములలో చదివి, ఆశను చంపుకొనలేక, ఉన్న సొత్తంతయు ఆ విధానమును సాధించు కృషిలో బోగొట్టుకొనిన దౌర్భాగ్యులు మనలో ఎందరో కలరు. భగవంతునికి, భక్తునికి మధ్య తప్ప మానవులలో పరస్పరము పాటించదగిన రహస్యము లేదు. 'నీయొక్కనికే ఈరహస్యమైన మంత్రము నుపదేశించుచున్నాను. ఇతరుల కెరుకబరచకుండ జపించి విముక్తుడ వగుము.' అను మానవు నెన్నడు విశ్వసింపరాదు. బుద్ధు డేమనినాడో వినుము. "రహస్యము స్త్రీలకు, అహంకార మదోన్మత్తులగు పండితులకు, అసంబద్ధమైన సిద్ధాంతమునకు వర్తించును. సత్యమును దాచలేము. బహిర్గత మగుట దాని ప్రధాన లక్షణము." శ్రీ వైష్ణవ మతస్థాపనాచార్యులగు శ్రీ రామానుజులు గురు ముఖమునుండి గోప్యముగ వినిన అష్టాక్షరీ మంత్రమును సర్వజనోప

యోగకరము నొనర్చిరని చెప్పెదురు. మంత్రము యొక్క మాహాత్మ్యము వాదోపవాదములద్వారా ఎఱుగుట అసంభవము. జపించి ఆచరించుట వలన నది తెలియబడును. ఆచరణ యోగ్యముకాని ఏ ధర్మమైనను నిరుపయోగమే కాకుండ, సత్యాపహారము నగును. గ్రుడ్డి నమ్మకముకన్న ఆచరణ వేయిరెట్లు శ్రేష్ఠము. వాక్స్వాతంత్ర్య మనిన వదరుట కాదు. దూషించుట దౌర్బల్యమును సూచించును. దూషణము క్రోధజనితము. దుర్బలుడు ముక్కోపి యగును. తిట్టినవాడు నష్టపడును. తిట్టబడినవాడు సురక్షితముగ నుండును. ఒకనాడు బుద్ధుడు భిక్షాటన జేయుచు ఒక గృహ యజమానిచే దూషింపబడెను. దూషింపబడియు, ప్రశాంతముగ నిట్లుపదేశించెను.

"మిత్రమా! గృహస్థు డొకడు యాచకునికి బిచ్చము వేయరాగా, యాచకుడు దానిని స్వీకరించ డనుకొనుము. ఆ బిచ్చము ఎవనికి చెందగలదు? గృహస్థునికే గదా! అటులనే భిక్షనర్థించు నన్ను దూషించితివి. నీ దూషణను నేను స్వీకరించను. అదెవరికి చెందగలదు? నీ యిష్టాయిష్టములతో బని లేకుండ అది నీకే చెందును. తద్వారా నీకు కలుగబోవు న్యూనతకన్న, ఒక స్నేహితుని గోల్పోవుట కారణముగ నాకు కలుగు నష్టము బాధాకరమైనది." జనన మరణముల కాకరమైన ఈ సృష్టి అనుక్షణము

మార్పు జెందుచుండును. జనన మొక మార్పు. మరణ మొక మార్పు. కాలగతి నెవ డాపగలడు? అది



భిక్షకై వచ్చిన సిద్ధార్థుడు కోపించిన గృహయజమానికి హితోపదేశము కావించుట.

అనంతముఖములతో సాగిపోవును. వృద్ధిక్షయములు దాని స్వరూపములు. ఈ రెంటినుండి తప్పించుకొను మార్గమును బుద్ధుడు మానవ జాతికి బోధించెను. ఎడ

తెగని రీతిగ విజ్ఞానము నార్జించుటయు, విజ్ఞానాభివృద్ధి ననుసరించి జీవిత విధానమును సంస్కరించు కొను టయు, విముక్తి సాధనములని స్థిరీకరించెను.

ప్రకృతి మార్పు ఆకస్మికముగ జరుగునది కాదు. క్రమబద్ధముగ జరుగుచుండును. విత్తునాటిన మరు క్షణమే మొక్క మొలవదు; కుక్కపిల్ల వెంటనే ఎదిగి పెద్దది కాబోదు, పసిపాప వెంటనే ముదుసలి యగుట అసంభవము. కాలానుసరణముగ పెరుగుట యగును. విజ్ఞానము నార్జించుటయు క్రమబద్ధముగనే ఉండ వలెను. వేఱొక విధముగ నుండుట జరుగదు. ఆర్జిం చిన విజ్ఞానమును పరిశీలనాదృష్టితో విశాల మొన రించి, వృద్ధి జేసికొనవలెను. నెలల పిల్లడు ఏడాది వాడుగ నెట్లు కాగలిగెనో తల్లికి తెలియును; కాని పిల్ల డెరుగడు. ఎందువలన? గ్రహించుశక్తి లోపిం చుటవలన. అదే విధముగ పరిశీలనాదృష్టి నలవరచు కొనని వాని విజ్ఞాన మంతగ నభివృద్ధి జెందదు. తాను నేర్చుకొనిన దెంత, ఏ విధముగ దాని నభివృద్ధి జేయ వీలగును, అభివృద్ధి ఏ పరిమాణములో నున్నది, అభి వృద్ధి కారణముగ తనలో ఎట్టి పరిణామము కలిగినది, మొదలగు విషయముల నెఱుగజాలని వానికి అభివృద్ధి యననేమో విశదము కాజాలదు.

రా:—రెండు వేల ఐదువందలేండ్లకు పూర్వము బుద్ధుడు బోధిం చిన విధానము మన కీనాడు ఆచరణ యోగ్య మె ట్లగును?

తం:—సత్యము నిత్యమైనది. కాలగతినిబట్టి పరిణామదశలకు లోనుగాక ఎల్లప్పుడు అఖండమై ప్రకాశించుచుండును. కనుక ఎన్నివేలేండ్లు గతించినను సత్యము సత్యముగానే పరిగణింపబడును. బుద్ధుడు బోధించినది సత్యసమ్మతము. ఏ కాలమునందైన ఆ బోధామృతము నాస్వాదించవలసి యుండును. మానవజాతి కళ్యాణము నాశించి సక్రమమార్గము నుపదేశించిన ప్రవక్తలలో బుద్ధుడు ప్రప్రథముడు. గుడ్డి నమ్మకములను విడిచి పెట్టి పరిశీలనాదృష్టితో విజ్ఞానోపార్జనకు బూనుకొనవలసినదిగా మానవజాతిని హెచ్చరించిన ప్రప్రథమ సంస్కర్త. అధోగతి పాలయిన మానవుల నుత్తేజితుల నొనర్చి సర్వమానవ సౌభ్రాతృత్వమును ప్రకటించిన దయామూర్తి. ఈనాటి దేశకాల పరిస్థితులలో ఆ మహామహు డొసగిన ఆదేశమునకు ప్రత్యేకృత, విశిష్టత కలదు. శాంతి సామరస్యములతో మన సమస్యలను సరిదిద్దుకొను టెట్లో ఎఱుగని అజ్ఞానముతో ప్రవర్తించు మనకు ఆయన ఆదేశము శిరోధార్య మగుచున్నది. రాజ్య విస్తీర్ణకాంక్షతో రక్త స్రవంతులను ప్రవహింప జేయ నుత్సాహపడు వారిరాక్ సత్యమును మాపుమాపుటకు బుద్ధు డుపదేశించిన అహింసావిధాన మాచరణయోగ్యముగ నొనరించుకొనుటయే మనకు శరణ్యము. లేనిచో మానవజాతి పరస్పర కలహములకు గురియై మటుమాయ మగును. దౌర్జన్యము, దురాశాభావము మానవుల వినాశము

నకు దారి తీయును. దురహంకారము, దురభిమానము మానవునికి సంకుచిత దృష్టిని కలిగించును. చెడుతలం పులవలన మానవుడు లోలోన దహించుకొని పోవును. దౌర్జన్యమును దౌర్జన్యముతో నణచుట కష్టము. దాని నణచుటకు ప్రేమించవలెను. ప్రేమకు లొంగని దేదియు లేదు.

వేలమంది సైనికుల నెదుర్కొని ఓడించుటకన్న తనను దా నోడించుకొని స్వేచ్ఛాజీవితము గడపుట దుష్కరము. శిక్ష ననుభవించుటకు ప్రతివ్యక్తి భయ పడును. మృత్యువనిన ప్రతి మనిషికి వెఱపు జనిం చును. ఇతరులబాధ తన బాధవంటిదే యని గ్రహించి ప్రేమభావమున మెలగవలెను. సులభముగ జంపుటకు వీలైనంతమాత్రాన అల్పప్రాణులనుచంపరాదు. ప్రాణ ములపై గలతీపి జీవులన్నిటికి సమానముగ నుండును. ఆ విషయమై హెచ్చుతగ్గులను పాటించుట అజ్ఞా నము. ఈర్ష్యాళువులమధ్య ఈర్ష్యారహితముగ ప్రవర్తిం చుట విజ్ఞాన లక్షణము. విజయము విరోధమును పెంచును. అపజయము గలిగినవా డవమానముతో బాధపడుచు ప్రతీకార మొనర్చుట కనవరతము పొంచి యుండును. ఇవి పరమ సత్యములు. చెక్కుచెదరనివి. భారతజాతి జనకుడగు గాంధీమహాత్ముడు మనుజుల ఈ సత్యమునే అనుదినము బోధించి ఆచరించెను. ఆయన దృష్టిలో సత్యమే దైవము; దైవమే సత్యము.సత్యము

నిత్యము; దైవము నిత్యము. సత్యస్వరూప మెఱుగు టకు స్వయంకృషి చేయవలెను. తర్కవితర్కములు నిరుపయోగములు. జ్ఞాననేత్రమునకే ఆ స్వరూపము గోచరమగును. జ్ఞాననేత్రమును దెరచునది క్రియ నియమ బద్ధజీవిత విధానము మాత్రమే. నియమబద్ధ జీవితము గడపుట కష్టసాధ్యము. కనుకనే బుద్ధుడు పరమాత్మను గురించి నిర్వచించుటకు నిరాకరించెను. తానుపదేశించినది సత్యమని గ్రుడ్డిగ నమ్ముటవలన లాభములేదని పలుమారు శిష్యులను హెచ్చరించెను. నేర్చుకొనినది ఎంతవఱకు సత్యమో స్వయంకృషి సలిపి గ్రహించవలెనని స్పష్టపరచెను.

బుద్ధుడు ముక్తిమార్గము నుపదేశించెను. దాని నధిగమించి ముక్తిని బడయుట ప్రతి వ్యక్తియొక్క ధర్మము. ఇతరు లెఱిగించినదే సత్యమని నమ్మిన పక్ష మున ఎందరెందఱో ఎన్ని విధములుగనో ఎన్నో విష యములను మన కెరిగింతురు. అన్నిటినివినిన మనకు ఏ యొకటి ఆచరణయోగ్యము గాక, దేనియందు నమ్మ కము కుదరక, కార్యవిముఖుల మగుదుము. స్వాను భవమును మించిన విజ్ఞానము లేదు. ఆ విజ్ఞానమువలన ఏది నిత్యమో, ఏది అనిత్యమో ఎఱుగగలము. నిత్య త్వమును సాధించుటయే ముక్తి. ఏ విషయము నైనను తరచి చూడనిదే అంగీకరించుట తగదు. బంగారము తప్త మొనరించినకొలది వన్నె కెక్కు

చుండును. అటుల కానిచో అది బంగారము కాదని వెంటనే తెలియును. ఎవరేమి చెప్పినను కాదనక, వెంటనే నమ్మక, ఎంతవఱకు సత్యసమ్మతముగ నున్నదో, ఆచరణయోగ్య మగునో కాదో పరిపరి విధముల నాలోచించి శ్రేయోదాయకమని తోచినచో స్వీకరించుట మంచిదని బుద్ధుడు తన శిష్యులకు సలహా నొసగెను. చీకటిలో పోవువాడు తనకు దా దీపము వెలిగించి వెంట గొంపోవును. ఇతరులు వెలిగించి యిచ్చువఱకు వేచి యుండువాడు మూర్ఖుడు, అసమర్థుడు. అజ్ఞానాంధకారమును బోగొట్టుకొనదలచిన అన్వేషకుడు స్వయంకృషిపై ఆధారపడవలెను. విజ్ఞానజ్యోతి నతడే వెలిగించుకొనవలెను. బుద్ధు డెరిగించిన అష్టవిధమార్గము మానవజాతికి అవశ్య మనుసరించ దగిన ముక్తిమార్గము. విషయలాలసతకు గురిగాక, దేహము నుపవాసాదులచేత శుష్కింప జేయక, మనోవాక్కాయ కర్మలయందు ధర్మప్రవర్తనను తప్పకుండ ఆచరించుటయే బుద్ధుని శాశ్వత సందేశము. దానిని మన మనుసరించుట అనివార్యము.

రా:—భారతదేశమునందు బౌద్ధమతము నేడు వ్యాప్తిలో నున్నదా? ఏ మతము ఎక్కువ వ్యాప్తిలో నున్నది?

తం:—బౌద్ధమతస్థులు మన దేశములో గలరు. కాని అట్టివారు స్వల్పసంఖ్యాకులుగ నున్నారు. నేడు హిందువులసంఖ్య చాల ఎక్కువ. బౌద్ధమతము హిందూ

మతమునకు వ్యతిరేకమని చాలమంది కొక అపోహ కలదు. కాని అది సత్యదూరము. అద్వైతము ద్వైత విశిష్టాద్వైతముల కన్న వేఱు కాదా? అంతమాత్రాన అద్వైతులు హిందువులు కారనగలమా? ప్రతి ప్రవక్త తన కాలమునాటి పరిస్థితులను బాగుచేయు వలెనను సంకల్పముతో సంస్కరణలను ప్రవేశ పెట్టెను. మత సిద్ధాంతము లెప్పుడు విశిష్టములే. వాని నాచరించు విధానమునందు, వ్యాఖ్యానించు ఘట్టము లందు వైపరీత్యము పొడగట్టును. ఈ విషయమై శ్రీ చక్రవర్తుల రాజగోపాలచారిగా లేమనినారో వినుము.

"యావత్ప్రపంచమునందు పూజ్యస్థాన మలంకరిం చిన బుద్ధభగవానుడు తాను ప్రవక్తనని కాని, దేవ దూతనని కాని ఎన్నడు చెప్పుకొనలేదు. క్రొత్త మతము స్థాపించుచున్నాననియు తెలుపలేదు. పర బ్రహ్మస్వరూపమునుగాంచు మార్గముమాత్ర ముప దేశించినాడు. ఆయన బోధించిన విషయములను బట్టి చూడ హిందూమత వ్యతిరేకియను సందేహ మెట్టి వారికి కలుగబోదు. కర్మసిద్ధాంతమును నిరాకరించు టకు బదులు దానిని బలపరచెను. దుర్జ్ఞానము వలన దుశ్చేష్టలవలన కలుగు విషమపరిణామమును విపుల ముగ విశదీకరించెను.

ఆత్మ వేదన లేదు. అది శాశ్వత మనియు, కర్మఫలి తము ననుసరించి పునర్జన్మ లభ్యమగుననియు తెలియ

బరచెను. ఆయన నిర్వచించిన ప్రకారము నిర్వాణ మనిన శూన్యములో కలియుట కాదు; అది నదీసాగర సంగమము వంటిది. ఆసియా ఖండవాసులకు బుద్ధుం డొక హిందూమత విజ్ఞానవేత్తగ ముక్తిమార్గమును జూపెను. దౌర్జన్యమునకు బదులు క్షమాగుణమును, క్రోధమునకు బదులు ప్రేమను, హింసకు బదులు అహింసా తత్త్వమును ఆయన మానవ హృదయము లందు నెలకొల్ప గలిగెను.

ఈశ్వర తత్త్వమేమో చర్చించుటకు బుద్ధుడు నిరాకరించెను. ఆత్మ పరమాత్మల సంబంధ మిట్టిదని కాని, వారిరువు రొకగా లేక వేఱుగ నుందురో అని కాని, వివాద పరిష్కారమునకు బూనుకొన లేదు. హిందూమత వ్యతిరేకి యగుచో బుద్ధునికి దశావ తారములలో స్థానము లభించెడిది కాదు.”

బుద్ధుడు యజ్ఞయాగములకొఱకు నోరులేని పశువు లను వధించుట నిషేధించెను. మదమాత్సర్యములతో కన్ను గానక ఇతరుల కంఠములను ఖండించుటను తీవ్ర ముగ ఖండించెను. అనుమానము, ఆగ్రహము, దౌర్జ న్యమును విడచి విశ్వాసము, అనురాగము, క్షమా గుణము కలిగియుండవలెనని బోధించెను. బాధించుట కన్న, బాధితుల కన్నీరు తుడుచుట ఎంత గొప్పపని! 1947 ఆగష్టు 15-వ తేదీన గాంధీమహాత్ముడు ఢిల్లీలో జరిగిన స్వాతంత్ర్య దినోత్సవములలో బాల్గొని ఆనం

దించకుండ, రక్తధారలలో నీదుకొని పోయినవారి సంబంధీకుల కన్నీరు తుడుచుటకై నవ్వకాళీ ఎందుల కేగెను? మహాత్ముడు బాధితులు పజ్జజేరి సేవజేయు



బుద్ధభగవానుడు "నోరులేని పశువులను వధించుట మంచిది కా"దని బోధించుట.

టయే భగవదాదేశమని విశ్వసించి అచటి కేగెను. ఆయన పూర్ణపురుషుడు కనుక, ఆ విధముగ జేయగలిగెను. బుద్ధభగవానుడు 2500 ఏండ్లక్రితమే మిదే సందేశము నందించెను. ఆనాడు హిందువు లాచరించు కర్మకాండను ఆయన తీవ్రముగ విమర్శించుటచే అది దోషభూయిష్ఠమై యుండెననుటలో సందేహము లేదు. మంచిని సంస్కరించు నవసరముండదు. ఆయన బోధించిన మార్గము సుకరముకాదు. నియమబద్ధముగ జీవితము గడపుట తేలికపని కాదు. నిరంతర కృషి, పట్టుదల, ప్రతిభ, ఆత్మచింతన మెంతో అవసరము. గుడ్డి నమ్మకము గలిగియుండుట సులభము. కాని పరిశోధించి, సత్యాసత్యములను గ్రహించి, సత్యస్వరూపము నీక్షించి, జీవితాంతము నలుపు కృషిని వదలిపెట్టక, నిర్వాణ మొందగలుగు మహాద్భాగ్యము సామాన్యులకు లభించదు. కాబట్టి బౌద్ధమతము హిందూమతమును అంతమొందించగలదను అసత్యప్రచారము లేవదీయబడినది. ఏ సత్యమునుగాని, మతమునుగాని అనుసరించు వారి సంఖ్య ఎక్కువగ నున్నపుడు దానికి వ్యాప్తికలుగును. లేనిచో పుట్టినచోటు నుండి అంతర్ధానమై అనుసరించు ప్రజలుకల దేశములలో వ్యాప్తి జెందును. అనుసరించువారి సంఖ్య అధికమైనను, అల్పమైనది, సత్యము సత్యమే. దాని స్వరూపము, శక్తి మారబోదు. కనుకనే బౌద్ధమతము

భారత దేశపు ఎల్లలనుదాటి ఆసియాఖండమునం దితర దేశములలో వ్యాప్తి గాంచెను.



ప్రతి వైశాఖ పూర్ణిమనాడు బుద్ధజయంతిని జరుపుకొని, ఆ అవతారమూర్తికి భక్త్యంజలి సమర్పించుట ప్రతి భారతీయుని విద్యుక్త ధర్మము.

ఓం తత్సత్.